# ప్రకృతి చికిత్సా సిద్ధాంతం

(గతసంచిక తరువాయి)

– డా॥ గంగాపురం హరిహరనా

నవీనవైద్యవిధానం రస, విష, గంధకాదుల ద్వారా రోగికి చికిత్స చేసేపద్ధతిని అనుసరిస్తుంది దీని వలన తాత్కాలికంగా రోగం ఉపశమించినా, అందలి ఉగ్రద్రవ్యాల దుష్ప్రభావం వల్ల దేహం అనూహ్యమైన క్రొత్తవ్యాధులకు గురిఅవుతున్నది. ఇది ''కొండనాలుకకు మందువేస్తే ఉన్ననాలుక ఊడిపోయింది'' అన్న సామెతకు తార్కాణంగా ఉన్నది.

ఆధునిక యాంత్రిక నాగరికతత కారణంగా కోట్లకొలది టన్నుల విషపదార్థాలు, వాయువుల వాతావరణంలోకి చేరుకొంటున్నవి. అణ్వస్త్రపరీక్షలవల్ల విశ్వవినాశనమైన ఉష్ణశక్తి (రేడియోధార్మిక శక్తి) అంతటా ఆవరిస్తున్నది. అరణ్యవిచ్ఛేదం వలన ప్రాణవాయువు కరువై విషవాయువులు అలముకొంటున్నవి. వీటివల్ల ప్రాణుల శ్వాసకోశం విచ్ఛిన్నమై హృదయకోశం పనిచేయని స్థితికి చేరుకొంటున్నది. క్రిమిసంహారక విషౌషధాల వలన పంటలు, కూరగాయలు విషపూరితాలైతున్నవి. ఈవిధంగా మనం ఆహారం పేర, నీటిపేర, ఔషధంపేర విషాన్ని సేవించే దుష్కాలం దాపురించింది. అభ్యుదయం పేర ప్రపంచం మృత్యుముఖంలోకి చేరుకొంటున్నది.

ఇట్టి దుర్భర వాతావరణం వలన వ్యాధిగ్రస్తుడైన మానవునికి విముక్తి లేదా? అన్న ప్రశ్నకు సమాధానం ప్రాకృతిక జీవనవిధానం– ప్రకృతి ప్రదూషితమైన ఈ పారిశ్రామిక నాగరికతకు, రస, విష, గంధకాద్యౌషధాలకు దూరంగా, ప్రవేశించినంతనే ముక్కును, కండ్లను మూయించి, రోదనధ్వనులను చెవులలో చొప్పించే యమాలయాలైన నేటి వైద్యాలయాలకు ఆవల, ప్రశాంతవనవాటికలకు మధ్య, చల్లని చెట్ల నీడల్లో, సుగంధవాసితాలైన పూపొదరిండ్ల నడుమ, విశ్రాంతి కల్పించి, స్వాదుజలంతో స్నానపానాలు, పచ్చని కూరగాయలు, పండినపండ్లు, గోరసాలతో హితమితమైన ఆహారం అందించి, ఉపవాసంతో అంతఃశరీరశుద్ధిని, ఆసన, ప్రాణాయామ, ధ్యానాదులతో మానసిక శుద్ధిని కావించి చన్నీటితో, మెత్తని మృత్తికతో, సూర్యరశ్మితో, ఆవిరితో, ఓషధి, వనస్పతులతో సహజమైన చికిత్స చేసి, ప్రసన్నచిత్తుని కావించి, మనుష్యునికి స్వస్థత చేకూర్చడమే ప్రకృతి చికిత్సకు గల ప్రయోజనం.

ప్రాచీనభారతజీవన విధానం ప్రాకృతిక జీవనసరళికి సన్నిహితమైనది. ప్రశాంతమైన అరణ్యాల మధ్య, నదీతీరాలలో ఆశ్రమాలను, గ్రామాలను నెలకొల్పడం, ఆయాఋతువులలో ఫలించే కందమూలఫలాలను వనస్పతులను సేవించడం, ప్రాణదానం చేసే ఓషధివనస్పతులను సూర్యచంద్రాదులను ఆరాధించడం, వ్రతాలలో, నోములలో, స్నానానికి, ప్రాణాయామానికి మృత్తికకు, ఉపవాసానికి, పాలు, పెరుగు, పండ్లు, తేనె, పూలు, పత్రి మున్నగువానికి ప్రాధాన్యం ఇవ్వడం దీనికి తార్కాణం.

చరాచరసృష్టికి ప్రబోధకుడు, ప్రాణదాత, వర్షకారకుడు, కాలస్వరూపుడు, మహాతేజస్వి సర్వశ్రేష్ఠమైన గాయత్రీమంత్రమునకు అధిష్ఠాన దేవత యైన సూర్యభగవానుని ఉపాసించడం మానవ సంతతికి ఆదిగ్రంథమైన ఋగ్వేదం హృద్రోగ, పాండురోగాదుల నుండి కాపాడుమని ఆదిత్యుని ప్రస్తుతించడం, ఇందలి భాగమే. ''ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్'' (ఆరోగ్యమునకై సూర్యుని ఆశ్రయించవలెను) అని వైద్యశాస్త్రజ్ఞుల ఆదేశం. ఆరోగ్యపరిరక్షణకై శరదృతువు



# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)


| సంపుటి : 11 | సంచిక : 6 | ఈశ్వర – జ్యేష్ఠం | జూన్ – 1997 |
|---|---|---|---|



ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**పింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.



చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్: 517799, 591322.


ఈ సంచికలో ..................... పుట



ముఖచిత్రం : **శివాజీ**

(హిందూ సామ్రాజ్య దినోత్సవ మాసం – జూన్)

సంపాదకీయం:

# కర్తవ్యం

''గత 33 సం॥లుగా విశ్వహిందూ పరిషత్ కార్యకర్తలు చేస్తున్న అవిరళకృషి, దేశవ్యాప్తంగా చేపట్టిన అనేకానేక ఉద్యమాల ఫలితంగా నేడు హిందూసమాజంలో క్రమంగా ఆత్మవిశ్వాసం పుంజుకొని, స్వాభిమానం మేల్కొంటున్నస్థితి కనిపిస్తున్నది. సమాజం తన అస్తిత్వాన్ని, అస్మితను, ఆత్మగౌరవాన్ని నిలద్రొక్కుకుని ప్రపంచం తనను ఒక గణనీయమైన శక్తిగా గుర్తించే స్థితిని సంపాదించుకోగలిగింది. నవచైతన్యం ప్రారంభమైంది. అయితే మరో వైపున హిందూవ్యతిరేక శక్తుల ఉధృతికూడా పెరుగుతూ, వాటి నుండి హిందూసమాజం అహర్నిశలు రాజకీయ, సాంస్కృతిక దాడులను ఎదుర్కొంటోంది. 'సెక్యులరిజం' అన్న ముసుగులో హిందుత్వాన్ని నాశనంచేయాలని అనేక శక్తులు పన్నాగంపన్ని అమలుజరుపుతున్నాయి. కేవలం జాగృత హిందూసమాజం మాత్రమే ఈ దాడులను త్రిప్పికొట్టగలదు. కనుక విస్తృత జనజాగరణ ద్వారా సమాజంలో నిరంతర అప్రమత్తతను నిర్మాణం చేయడం మన ప్రప్రథమ కర్తవ్యం.

ధర్మార్థ కామమోక్షాలనే నాలుగుపురుషార్థాలను లక్ష్యాలుగా వుంచుకొని, శ్రేయోమార్గంలో వెళుతూ నలుగురితోబాటు తనూప్రగతిని సాధించాలని సూచించినాయి హిందువుల శాస్త్రాలు. ఇందులో ఉత్తమమైనది మోక్షమైతే మిగతా మూడు ఆమోక్షానికి క్రమమార్గదర్శకాలు.

ఆదర్శభగవద్భక్తుడు మోక్షాన్నికూడా త్రోసిరాజని ఆభగవత్సేవను, పరోక్షంగా భగవంతుడు దర్శనమిచ్చే పరమేశ్వర రూపమైన సమాజసేవను కోరుకుంటాడు. అందుకోసం తన సర్వస్వాన్నీ అనగా ''సర్వ''మనబడే తన సంపాదననూ ''స్వము'' అనే తనను తాను అర్పించుకుంటాడు.

ఇంతచక్కని మార్గాల ద్వారా ఇహ, పరాలను సంపాదించే పద్ధతులు వున్న సమాజం సువ్యవస్థితంగా వుండే అవకాశాలు పుష్కలంగా వున్నా, పాశ్చాత్యనాగరికతా వ్యామోహాలు అలుముకున్న నేపథ్యంలో, విషసంస్కృతులు పనిగట్టుకొని సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తున్న నేపథ్యంలో, పాకిస్తాన్‌లాంటి ఇరుగు పొరుగుదేశాల కుట్రలు కుతంత్రాలతో నిప్పులేకుండానే సంస్కృతి దహనమయ్యే నేపథ్యంలో ('జ్ఞాతిశ్చేదనలేనకిం?' అంటారు) జనం ఆవారసత్వాన్ని పుణికి పుచ్చుకోలేని దయనీయస్థితి దాపురించింది.

అయితే విశ్వహిందూ పరిషత్ ధర్మం ఆధారంగా యీ పరిస్థితిని ఎదుర్కొని హిందువులవైభవాన్ని పునఃప్రతిష్ఠితం చేసే ప్రతిజ్ఞను శిరసావహించింది.

హిందూ సమాజం తన అభ్యున్నతికై అనేక మార్గాలను ఏర్పరచుకున్నది. వ్యక్తినీ, అతని కుటుంబాన్ని కుటుంబం ద్వారా సమాజాన్ని శ్రేయోమార్గంలో పయనింపజేసేందుకు ఎన్నో ప్రక్రియలను చేపట్టారు హిందువులు. అందులోని ఒకానొక అంశం ''చతురాశ్రమవ్యవస్థ''. ప్రస్తుతం గృహస్థాశ్రమం ఒక్కటే చిక్కి శల్యమై కనబడుతున్నది. బ్రహ్మచర్యాన్నీ, వానప్రస్థాన్నీ, సన్యాసాన్నీ ప్రోత్సహించి సమాజ వ్యవస్థలో ఏర్పడిన అసమానతను నివారించవలసి వున్నది. ప్రచారక

వ్యవస్థద్వారా బ్రహ్మచర్యాన్ని పరమ పూజనీయ డాక్టర్‌జీ ఉద్బోధిస్తే, గత కొంతకాలంగా మాననీయ శ్రీ అశోక్ సింఘాల్‌జీ వానప్రస్థులుగా రమ్మని పరిపక్వమానసులను కోరటం, కొందరిని తయారు చేయటం, పురావైభవస్థితిని తిరిగి చేరుకునేందుకు జరిగే సత్ప్రయత్నాలుగా యివి గోచరిస్తున్నాయి.

దేహంలో వివిధ అంగాలు వుంటాయి. అన్నీ కలిసి సమిష్టి శ్రేయస్సుకు పాటు పడినట్లే, సమాజంలోని వివిధ, విభిన్న వర్గాలు సమాజ శ్రేయస్సు కోసం సమన్వయంతో పనిచేయాలి. పాశ్చాత్యీకరణం చేత ఏర్పడిన అసమన్వయం, స్వార్థం, సమాజ జీవనాన్నే ముక్కలుగా నరికివేసింది. ఈ అసంతులనాన్ని సంతులనంగా మార్చి, ముక్కలను ఒక్కచోజేర్చి, అతికి సౌష్ఠవశరీరాన్ని ఒనగూర్చుకోవాలి. ఈ సమరసతాస్థితిని చేరుకునేందుకు, ఎందర్నో త్యాగనిరతులుగా మార్చేందుకు మనం ప్రోత్సహించాలి. త్యాగం లేకుండా యిది నెరవేరదు.

మనస్సుకు వికాసం కలిగిన కొద్దీ దేవతలు, భాషలు, తత్వాలు, సంప్రదాయాలు ఉపాసనాపద్ధతులు, అంతా విస్తరించుట మొదలయింది. వేదాలు, ఉపనిషత్తులు, రామాయణం, భారతేతిహాసాలు, పురాణాలు, కావ్యాలుగా విస్తారం చెందిన హిందూ సాహిత్యంలో అనంతవైవిధ్యం వ్యక్తమైన విచారధారకు (శృతిర్విభిన్నా స్మృతయశ్చభిన్నా నైకోమునిః యస్యవచో ప్రమాణం) ఫలం అద్వైత పరమార్థమే. అహంకార, మమకారం, నేను-నాది, అనుకోవటంలోని ద్వంద్వాన్ని హవనం చేయటమే దుర్వాసుడు సాధన యజ్ఞంగా చెప్పాడు. ఈ అద్వైత స్థితిని సాధించే ప్రయత్నం నిరంతరం కొనసాగుతూనే వున్నది. ఈ ధ్యేయసాధనలో భాగాలైన ఏకతామంత్రం ('యంవైదికా మంత్రదృశః'), సత్సంగం- ఇతరులతో సమయాన్ని కలిసి పంచుకోవటం - వీటితో - ''పరంవైభవం నేతుమేతత్‌స్వరాష్ట్రం'' ధ్యేయం వైపు ఉత్సాహంతో పరుగులు పెట్టుదాం. ఆతల్లి ఆశీస్సులు మనకు ఎప్పుడూ వుంటాయి. సత్సంగాలను సాధ్యమైనన్ని ఎక్కువ స్థలాల్లో ఏర్పాటు చేసేందుకు, సక్రమంగా నడిపేందుకు, కార్యకర్తలను ప్రోత్సహిద్దాం. సత్సంగాలలోనే సమాజపరమాత్మను దర్శించగలగాలి. మొత్తం సమాజహితాన్ని కాంక్షించేవ్యక్తికి తనహితం సైతం అందులోనే అంతర్నిహితమై ఉందని గ్రహించాలి.

సత్సంగాలు నడపాలన్నా, సమరసతను సాధించాలన్నా సమయదానం అత్యంత ఆవశ్యకమైన విషయం'' అని వి.హిం.ప. (ప. ఆంధ్ర) 2వ ప్రాంత ప్రతినిధి సభలో ఏప్రిల్ 27న ప్రాంతఅధ్యక్షులు శ్రీ జి. పుల్లారెడ్డిగారు తమ అధ్యక్షోపన్యాసంలో కార్యకర్తలకు, సమాజానికి చక్కని సందేశం అందించారు. -జైహింద్.

'సెక్యులరిజ' ప్రభుత చేతలు భిన్నమై
అధికశాతమున్న హైందవులను
కించపరచుచుంట వంచన యౌగదా!
విశ్వహిందు వాణి వినుడు వినుడు

- సుందరం

# ఛాందోగ్యోపనిషత్ - విశేషాలు - 3

లోకంలో బాలురందరు తమతోటి పిల్లలు ఏమిచేస్తారో అదే తానూ చేయాలని ఆలోచిస్తారు. కొంతమంది దానికి భిన్నంగా ప్రవర్తించినా కొంతకాలానికి ఎక్కువ మంది చేసేపని తానుకూడా చేయాలని నిశ్చయించుకుంటారు దీనికైవారు తహ తహ లాడుతారు. ఇది స్వాభావికము. సత్యకాముడనే బాలుడు తన గ్రామంలోని బాలురు అందరు విద్యాభ్యాసం చేస్తుంటే తాను గ్రామంలో ఊరకనే పనిలేకుండా తినితిరగడం ఎందుకుచేస్తున్నానని ఆలోచిస్తాడు. తానుగూడ విద్యాభ్యాసం చేయాలనే బలీయమైన కాంక్షతో అతడు తనతల్లి వద్దకువెళ్ళి అమ్మా! మన గ్రామంలోని పిల్లలందరు గురువువద్ద విద్యాభ్యాసం చేస్తున్నారు. దానికి వారి తల్లిదండ్రులు సహకారం మిస్తున్నారుగదా! మరి నీవు నాకెందుకు విద్య నేర్పించుటలేదు? నాకుగూడ విద్యాభ్యాసం చేయాలని కోరికగా ఉంది. నేను గురువువద్దకు వెళితే వారు నాగోత్రం అడుగుతారుగదా! నా గోత్రమేమిటో చెపితే నేనుగురుశుశ్రూషచేసి జ్ఞానం సంపాదించుకొంటాను, అని అడిగాడు. ఆమాటలువినగానే తల్లి బిత్తరపోయి తత్తరపడి ఇంతకాలంగా దాగిన విషయాన్ని వీనికి ఇప్పుడు చెప్పక తప్పదని నిర్ణయించుకొని ఈవిధంగా చెప్పింది.

నాయనా! నేను యౌవనంలో ఉండగా చాలామంది ఇండ్లలో పనులుచేస్తూ వారిని సేవించాను. ఆసమయంలో నేను గర్భవతినై నిన్ను కన్నాను. కానీ నీ తండ్రిగోత్రంనేను అడుగలేదు. అందువలన నాకావిషయంతెలియదు. కాబట్టి నీవు నీ గురువుకు చెప్పి ''నా పేరు జాబాల నీ పేరు సత్యకామ కావున నేను సత్యకామజాబాలిని అని చెప్పు. వారు అను గ్రహిస్తారు అనిచెప్పి దీవించిపంపింది.

వెంటనే ఆబాలుడు గౌతముడను గురువును సమీపించి వినమ్రుడై గురుదేవా! ''నాతోటి బాలురందరు తమవద్ద విద్యాభ్యాసం చేస్తున్నారు నేను అజ్ఞానంతో గ్రామంలో దిమ్మరిగా ఉన్నాను. నాకుగూడ చదువుకోవాలనే వాంఛ బలంగా ఉంది. కాబట్టి నన్ననుగ్రహించి విద్యాదానం చేయగోరుతున్నాను మిమ్ములనే శరణుపొందాను అని గురువుపాదాల వద్ద శిరస్సు ఉంచి ప్రార్థించాడు.

అప్పుడు గురువు నాయనా! నీ గోత్రమేమిటి అని అడుగగా, ఆచార్య! నా గోత్రమేమిటో నాకు తెలియదని తన తల్లి చెప్పిన విషయాలన్నీ గురువుకు విన్న వించుకొని తన పేరు సత్యకామ జాబాలి అనిచెపుతాడు.

ఈ మాటలు విన్న గురువు ఈ బాలుడు పేరుకు తగ్గట్లు సత్యమునే చెప్తుతున్నాడు. ఇతడు సద్వంశజుడే అయి ఉంటాడు. లేకుండా నిజాన్ని పలుకడు. అని నిశ్చయించుకొని నాయనా! సమిధలను తీసుకొని రమ్ము. నీకు ఉపనయన సంస్కారముగావించి శిష్యునిగా స్వీకరించెదననెను.

వెంటనే సత్యకాముడు అడవికివెళ్ళి సమిధలను తీసుకొనిరాగా గౌతముడు వానికి యధావిధిగా ఉపనయన సంస్కారం చేసి అనుగ్రహించాడు. సత్యకాముడు బ్రహ్మచర్య దీక్షబూనిన తర్వాత గురువు తన గోవులలో బాగా చిక్కియున్న నాలుగువందల గోవులను వేరుచేసి ఆతనికప్పగించి నాయనా! ఈ నాలుగు వందల గోవులను అరణ్యమునకు తోలుకొనిపోయి నీవును అచటనే ఉండి వేయి గోవులగు వరకు వీటి సేవ చేస్తూ వేయి గోవులుకాగానే తిరిగి రమ్మని పంపెను.

మనం దీనిని పరిశీలిస్తే మన ప్రాచీనులు సమాజం సవ్యంగా ఉంటానికి ధర్మపూర్ణం కావడానికి మానవునకు గుణాలే ప్రధానంగాని తాను పుట్టిన కులం కాదని, ఎవడు సద్గుణవంతుడై, సత్యశీలియై, పరోపకారపరాయణుడై, బ్రహ్మ జ్ఞానం కలవాడై జీవిస్తాడో అతడే నిజమైన బ్రాహ్మణుడని గుణములకే ప్రాధాన్యం ఇచ్చారు. మనం ప్రస్తుత సమాజంలోని సమస్యలను పరిష్కరించాలంటే సమాజాన్ని ఏకత్రాటిపై నడిచేటట్లు చేయాలంటే అందరిలోనూ గుణప్రాధాన్యతను గమనించి, సత్యస్వరూపమైన బ్రహ్మజ్ఞానం అత్యంత ఆవశ్యకమని తెలుసుకొని జీవిద్దాం. ఇదియే మన సంస్కృతీసాంప్రదాయాలకు అందమని తెలుసుకొని ప్రవర్తిద్దాం.

ఈ దేశం కీర్తి ప్రతిష్ఠలతో ప్రపంచంలో ఆదర్శంగా నిలబడాలంటే మనలోని విభేదాలు తొలగిపోవాలి సత్యపూరితమైన జీవితం ప్రధానమని గుర్తించాలి.

సత్యగుణాన్ని ఆదర్శంగా గ్రహించి హరిశ్చంద్రుడు కష్టాలపాలబడినా చివరకు ఆనంద స్వరూపుడై లోకంలో ఈనాటికి కీర్తింపబడుతున్నాడు.

శ్లో॥ సత్యేన ధార్యతే పృథ్వీ సత్యేన తపతూరవిః।
సత్యేనవాయవోవాంతి సర్వం సత్యేప్రతిష్ఠితమ్॥
అంటే భూమి సత్యముచేతనే వెలుగుచున్నది.
గాలి సత్యముచేతనే వీచుచున్నది.

ఈ సమస్త ప్రపంచము సత్యమందు ప్రతిష్ఠితమైయున్నది సత్యకామునివలె సత్యంలో బ్రహ్మజ్ఞాన సంపన్నులమై సమాజసేవలో జీవిద్దామా! – ఉపద్రష్టవెంటకృష్ణయ్య

---

# ఆదినుండి ఆధునికం వరకు - స్త్రీ

(గతసంచిక తరువాయి) - డి.జి. విజయలక్ష్మి

ఇకదశోపనిషత్తులలో ప్రశ్న, ముండక, మాండూక్య అధర్వవేదమునకు చెందినవే. 4వ కాండలో 5వ అనువాకంలోని 30 సూక్తాలు వాక్ అనే ఋషిక చెప్పినవే. వీటిని జాతకర్మ, మేధా జననార్థం శిశువును ఒడిలో పెట్టుకుని చేసే ఆజ్యహోమంలో, ఉపనయన సమయంలో, ఆధ్యయనం ముగిసిన తర్వాత, పంచకర్మలలో కూడా వినియోగిస్తారు. ఇన్ని విధములుగా ఉపయుక్త మయ్యే సూక్తాలను చెప్పిన స్త్రీలకు తక్కువేమిటి? ఇలా నిశితంగా గమనించినట్లైతే ఏ వేదంలోనూ స్త్రీని కించ పర్చినట్లు, ఘోషాపద్ధతులున్నట్లు, పురుషులకంటే అధమురాలుగా చెప్పినట్లు ఆధారాలు లేవు సరికదా ఆధికురాలుగా చెప్పిన సందర్భాలు లేకపోలేదు.

**మనుస్మృతి - స్త్రీలు -**

మనకు వేదములు ప్రమాణ గ్రంథాలు. ఆ వేదములలోని విషయమునే ప్రతిపాదిస్తూ మానవుల శ్రేయస్సు కొరకు మహర్షులు సూత్రీకరించిన నియమాలే ధర్మ శాస్త్రాలు. ధర్మం కేవలం బాహ్య వ్యవహారాలేకాక అంతః కరణ ప్రవృత్తులను కూడ నియంత్రిస్తుంది. జీవన లక్ష్యాన్ని చూపించి, చిత్తశుద్ధిని కల్గించి, మనిషిని శ్రేయోమార్గంలో నడిపిస్తుంది. అందుకే, ''ధర్మేణైవ ప్రజాః సర్వాః రక్షంతిస్మ పరస్పరం'' అని భారతంలో చెప్పబడింది. అంటే ధర్మము చేతనే ప్రజలు పరస్పరము రక్షించబడుతారని అర్థం. అసలు ధర్మమంటే ఏమిటి?

విద్వద్భిః సేవితః సద్భిః నిత్యమద్వేషరాగిభః।
హృదయే నాభ్యనుజ్ఞాతో యోధర్మః తంనిబోధత॥

రాగద్వేష రహితులైన సజ్జనులు ఏ సదాచారములు స్వీకరించినారో అవియే ధర్మములు - వారు వేదార్థముల గ్రహించి సామాన్యుల కవగతమయ్యేలా వాటి సారాన్ని శాస్త్రాలుగా మనకందించారు. ఈ ధర్మ శాస్త్రాలన్నింటిలో మనువు రచించిన ధర్మశాస్త్రమే శ్రేష్టమైనదిగా మహనీయు లంగీకరించారు. 'మనుః సర్వ జ్ఞానమయః' అంటూ, ధర్మశాస్త్రాలని స్మృతులని, వేదాలను శ్రుతులని అంటారు. శ్రుతీరివార్థం స్మృతిరవ్యగచ్ఛత్'' అంటూ ఉపమానంగా చెప్పారొక కావ్యంలో. మనువు ఏదిచెప్పినా అది మానవులకు దివ్యౌషధంలా మేలు చేసేందుకే. వేదానుకూలంగా రచించిన ఆయన 'మనుస్మృతి' మనుషులకో దివ్య స్మృతి. మనుస్మృతిలోని సిద్ధాంతాలకు విరుద్ధంగా వున్న మనుస్మృతి ప్రశంస యోగ్యంకాదని బృహస్పతిస్మృతిలో చెప్పబడింది.

మనుస్మృతి విరుద్ధా యాస్మృతిర్న ప్రశస్యతే।

వేదార్థోపనిబద్ధత్వాత్, ప్రాధాన్యం హిమనోఃస్మృతేః॥ అంటూ, అట్టి ప్రశస్తమైన మనుస్మృతిలో ఏ ఏసంస్కారాల వల్ల ఏ ప్రయోజనం వుంటుందో విశదీకరిస్తూ మనిషి గర్భస్థుడైన సమయం నుండి మరణానంతరం శ్రాద్ధకర్మల వరకు చేయవలసిన కర్మలు విధించ బడ్డాయని, వీటినే షోడశ

సంస్కారాలంటారని మనందరికీ తెల్సు. అలాగే ఆయన స్త్రీలను కించపర్చుతూ రచన చేసాడని, స్త్రీల విషయంలో అగౌరవంగా, అసహ్యంగా చిత్రిస్తూ ఉల్లేఖించాడనే అపప్రథలనేకం వున్నాయి. అది ఎంత వరకూ నిజం? నిజమైతే ఏ విధంగా అగౌరవం కల్గించాడు! అని ఆలోచించే వాళ్లు నిజంగా ఎంతమంది వున్నారు?'' పదుగురాడు మాట పాడియై ధరచెల్లు'' అన్నట్లు జనవాక్యం సత్యమనే భ్రమలో మహర్షి మనువును నిందించేవారు. మనమొకసారి మనువు దృష్టిలో మహిళల స్థానమెలాటిదో పరామర్శిద్దాం! ఆయన స్త్రీలకెంత హితుడో, ఎలాటి అహితుడో పరిశీలిద్దాం!!

అసలు సృష్ట్యాదిలో భగవంతునిలో సగభాగంగా చిత్రించాడామెను మహర్షి మనువు. 1వ అధ్యాయంలో 37వ శ్లోకం.

ద్విధా కృత్వాత్మనో దేహమర్థేన పురుషో భవత్।

అర్ధేనారీ --- అంటూ. బ్రహ్మ శరీరం రెండు భాగాలుగా విభక్తమై సగభాగం పురుషుడుగా, సగభాగం స్త్రీగా మారింది అని పై శ్లోకానికర్థం. అదే శరీరంలో ఒక భాగము ఉన్నతం మరొక భాగమున అధమం సాధ్యమా? స్త్రీ పురుషునితో సమానమని వ్యక్త పర్చడమే మనువు మనోగతాభిప్రాయమై వుంటుంది. స్త్రీ పుట్టుకనుండి అంటే శిశువుగా వున్నప్పటినుండి మాతృస్థానం వరకూ, తనయగా, తల్లిగా, చెల్లిగా, చెలియగా, అన్ని స్థానాల్లోనూ ఆమెకగ్రపీఠమే. ఆమె పట్ల ఉదారత, ప్రేమ, వాత్సల్యం ప్రస్ఫుటించే విధంగా శ్లోకాలు రచించారు. స్త్రీల పట్ల గౌరవాన్ని వ్యక్తం చేసే శ్లోకాలు కోకొల్లలు. మనం కొన్నింటినైనా పఠిద్దాం!

ఆడపిల్ల పుడితే ఆమె కెలాంటి పేరు పెట్టాలి అనేది 7/33 శ్లోకంలో వివరించాడు – స్త్రీణాం సుఖోద్యమ క్రూర విస్పష్టార్థం మనోహరమ్।

మాంగల్యం దీర్ఘ వర్ణాంతమ్ ఆశీర్వాదాభాదానవత్. అంటూ సుఖోద్యమం అంటే సులభంగా పల్కగలగేదిగా వుండాలి. అక్రూరం అంటే క్రూరమైన అర్థం లేకుండా, సున్నితంగా. విస్పష్టార్థం =స్పష్టమైన అర్థయుక్తమైన మనోహరమైన, శుభకరమైన, పేరు చివర దీర్ఘాక్షరము ఆశీర్వాదవాచకం కల్గిన పేరు పెట్టాలిట. పేరులోనే ఆమె లాలిత్యం, సౌశీల్యం, సౌకుమార్యం అర్థమై పోవాలన్న మాట? మరిప్పుడో? అర్థంలేని పేర్లు, అర్థంకాని పేర్లు పెట్టుకుంటున్నాం. ఉదా॥ శిల్ప, చిత్ర, అంటే శిల్పమంటే రాయి, చిత్రమంటే బొమ్మ అని అర్థం. ఇవిరెండక్షరాల్లోని ఆధునిక పేర్లు. ఇక మూడక్షరాల ముచ్చటైన పేర్లు మౌనిక, హారిక, ప్రియాంక, పేర్లు అందంగావుంటే చాలనుకుంటారు. కాని ఆనాడు అర్థవంతమైన పేర్లకే ప్రాధాన్యత నిచ్చేవారు, సుశీల, సుస్మిత, సునయన, సులోచన అంటూ. పేరు పెట్టే విషయంలో కూడ మనువెంత చక్కని నియమాలు చెప్పారో చూడండి.

ఇక బిడ్డను కూడ అమ్మా అని పిల్చుకునే సుసంస్కృతికి వారసులం మనం వత్సే; అంబ అని సంభోదించేవారు శాస్త్రాల్లో. పరస్త్రీలతో మాట్లాడేటప్పుడు ఎలా సంభోదించాలో కూడ చెప్పాడొక శ్లోకంలో.

పరపత్నీతు యా స్త్రీస్యాత్ అసంబంధాయోనితః।
తాం బ్రూయాద్భవతీత్యేవం సుభగే భాగినీతి చ॥

భావతీ అంటే మీరు అని గౌరవసూచక బహువచనార్థంతోనో సుభగేఅంటే సౌభాగ్యవతీ అనిగాని, భాగినీ అంటే అక్కయ్యా అని, తమకంటే చిన్నదైతే చెల్లీ అని (భాగినీ శబ్దానికి అక్క లేక చెల్లెలు అని అర్థం) గౌరవంగా సంభోదించాలి. తమ కంటే చిన్నవారిని ఆయుష్మతీ అని ఆశీర్వాద సూచకంగా కూడ సంభోదించాలి అన్నారు మరో శ్లోకంలో. తమ కంటే పెద్దవారిని మాతృభావనతో సంభోదించాలన్నారు. ఇక కుటుంబంలోని బంధు జనుల్లో స్త్రీలను ఎలా సంభోదించాలో గౌరవించాలో కూడ చెప్పారోచోట-

గురుపత్నీ, రాజపత్నీ, జ్యేష్ఠపత్నీ తథైవచ।
పత్నీమాతా స్వమాతాచ పంచైతాః మాతరః స్మవితాం॥

గురువుభార్య, పాలకునిభార్య, అన్న భార్య (వదినె) భార్యతల్లి,(అత్త) తన తల్లితో సమానంగా గౌరవించదగినవారు. తల్లిని తండ్రికన్నా వెయ్యిరెట్లు అధికంగా గౌరవించాలన్నారు.

ఉపాధ్యాయాన్ దశాచార్యః, ఆచార్యాణాం శతంపితా।
సహస్రంతు పితౄన్ మాతా, గౌరవేణాతిరుచ్యతే॥

పదిమంది ఉపాధ్యాయుల కన్న ఒక ఆచార్యుడు, వందమంది ఆచార్యులకన్న ఒక తండ్రి, వేయిమంది తండ్రులకన్నా ఒక తల్లి అధికంగా గౌరవించతగిన వారనే భావాన్ని వ్యక్తం చేసే శ్లోకమిది-

స్త్రీని గౌరవించకపోతే ఏమౌతుందో, ఎలాటి కష్టనష్టాలు పొందుతారో కూడ చక్కగా వివరించారిక్కడ-

యత్రనార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

ఏక్కడ స్త్రీలు గౌరవించబడతారో అక్కడ దేవతలు సంతోషిస్తారు. స్త్రీలు గౌరవించబడని చోట యజ్ఞాదికర్మలన్నీ నిష్ఫలమౌతాయి.

''శోచంతి జామయోయత్ర వినశ్యత్యాశు తత్కులమ్॥'' అన్నారింకొక శ్లోకంలో. స్త్రీలు గౌరవింపబడక శోకించిన వంశమునశించునని అర్థం. స్త్రీలనెలా గౌరవించాలో, ఎందుకు గౌరవించాలో, గౌరవించక పోతే కల్గేనష్టమేమిటో వివరించిన మనువుకు స్త్రీలపై హీనదృష్టి వుందంటే నమ్మసాధ్యమా? స్త్రీలప్రగతికి ధర్మశాస్త్రం విఘ్నం కల్గించటం సత్యమా? అని యోచించాలి మనం. అంతేకాదు నిత్యకృత్యాలలో కూడ ఆమె గురించి, ఆమెహితవు గురించి ఎన్నో విషయాలు శ్లోకరూపంలో వివరించారు.

సువాసినీ కుమారీశ్చ రోగిణీ గర్భిణీస్త్రియః।
అతిథిభ్యోగ్ర ఏవైతాన్ భోజమేదవిచారయన్॥ అనగా –

క్రొత్త పెండ్లికూతురు, అనారోగ్యవంతురాలు, కన్య, గర్భిణీ మొ॥ స్త్రీలకు అతిథులకన్నా ముందే భోజనం పెట్టాలి అని అర్థం. భర్త తినేవరకూ, ఎదురుచూడాలి, భర్త తిన్న తర్వాతనే తినాలి, భర్త తిన్న ఎంగిలి పళ్లెంలోనే తినాలి అనే నియమాలేవీ ఆనాడు లేవు. అసలెక్కడా పురుషుడేముందు భోజనం చెయ్యాలనే ప్రస్తావనే లేదు. కాని స్త్రీలుకొన్ని సందర్భాలలో అందరికన్నా ముందే తినాలనే చెప్పబడింది. అంటే ఈ ఆచారాలు మధ్య కాలంలో సంకుచితులేర్పరిచినవే కాని ఏధర్మ శాస్త్రాలు నిర్దేశించినవి కావని సుస్పష్టం. మరైతే ఇలాంటి మూర్ఖపు ఆచారాలేర్పరిచి, ఇది శాస్త్రంలో చెప్పబడిందంటూ శాసించే పెద్దలనేమనాలి అనిపిస్తుంది మనకు. వారి దృక్కోణంలో నుండి చూస్తే వారిమాట కరక్టేనని అంగీకరించక తప్పదు. ఎలాగంటే ఒకప్పుడు ఉమ్మడి కుటుంబాలెక్కువగా వుండేవి. అపుడు స్త్రీలు ఎక్కువగా గృహకార్యాలకే పరిమితమై వుండేవారు. పగలంతా శ్రమించినవ్యక్తి ఆలస్యంగా ఇల్లుచేరితే అందరూ తినగా మిగిలిన అడుగుబొడుగు వారికి పెట్టడం ఇష్టలేకనో ఎండలో కష్టపడివచ్చే వ్యక్తి తినకుండా తాను తినటం ఇష్టం లేకనో, భర్తతో కల్సితినే ఆనందానుభూతికోసమో స్త్రీలు తాముతినకుండా ఎదురుచూశేవారేమోననిపిస్తుంది. ఇక ఈ ఎంగిలి పళ్లెంలోనే తినాలనే ఆచారంలో నిజాన్ని పరిశీలిస్తే-

మనువు స్త్రీల విషయములో ఇలా అన్నారు-
త్రీణివర్షాణ్యుదీక్షేత, కుమార్యృతుమతీ సతీ।

ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్, వాదేత సదృశీం పతిం॥ అంటే కన్య రజస్వల అయిన మూడు సం॥ల తర్వాత తనతో సమానుడగు పతిని పొందవలెను. అంతకుముందు వివాహమాడకూడదని భావం. కనీసం 12 లేక 13 సం॥ రజస్వల అయిన తర్వాత 3 సం॥ అంటే 16 సంవత్సరాల తర్వాతే వివాహప్రసక్తి అని స్పష్టమౌతుంది. అయితే ఆతర్వాత కాలంలోనే భర్తంటే భయము, దగ్గరికి పోవటానికి సంకోచము వుంటాయని, అవి పోగొట్టడం కోసం, ఒకే ప్లేటులో తినటం, భర్త తిన్న ప్లేటులో తినమనటం చేశారేమోనని భావించవచ్చు. (సశేషం)

---

# ప్రపంచంలో అసలైన ముస్లిందేశం లేనే లేదు

ముస్లింల మధ్య ఇంటర్‌నెట్ చర్చలు విశ్వాసంలోనికి తీసుకుంటే నేడు ప్రపంచంలో ముస్లిం దేశాల్లో ఏ ఒక్కటి అసలైన ఇస్లాందేశం కాదు. అనితేలింది.

5-5-1997న వరల్డ్ బ్రాడ్ కాస్టింగ్ సర్వీస్ అధ్వర్యంలో ముస్లిం సంభాషణా భవనంలో చర్చల్లో పాల్గొన్న ముస్లింలంతా సౌదీ అరేబియా, పాకిస్తాన్, సూడాన్, లేక చివరకు గడ్డాఫీ లిబియాలనూ సహితం అసలైన ఇస్లాందేశాలుగా పిలవడానిక తిరస్కరించారు.

చర్చల్లో పాల్గొన్నవారిలో సున్నీలు అధికం. వారి దృష్టిలో షియా ఇరాన్ అసలు ఇస్లామ్ కానేకదట.

ఏదేమైనా అఫ్ఘనిస్తాన్‌లోని తాలిబన్ ప్రభుత్వం పై గొప్ప ఆశలు వ్యక్త పరచారు.

(మీ.ఫో)

# భారతపౌరుల విధులు

**ప్రతివ్యక్తి కనీస ధర్మాలు :**

1. **భారతదేశరక్షణ ప్రథమకర్తవ్యం :** దేశ ప్రగతి ప్రథమ లక్ష్యం. దేశం కొరకు ప్రాణాన్నైనా అర్పించాలి.
2. **విధి :** దైవభక్తి, సచ్ఛీలము, సత్ప్రవర్తనతో జాతికి సేవ.
3. **శీలము :** సచ్ఛీలమేపెన్నిధి, లంచగొండి గాని స్వచ్ఛమైన పౌరుడు జాతికి దేశానికి ఒక వరం.
4. **ఆరోగ్యం :** విజయానికి మూలం ఆరోగ్యం. ఆరోగ్యమే మహాభాగ్యం. శీలము తర్వాత ఆరోగ్యము కాపాడుకొనుట జాతికి ప్రధానము.
5. **మంచితనం :** మద్యపానం, మత్తు పదార్థవాడకం, ధూమపానం, పాన్‌సేవనం, లంచగొండితనం, వరకట్నం, స్వార్థం, అవినీతి, మోసం, మొదలగు దుశ్చర్యలను నిర్మూలించవలెను. జాతియెడ అవిశ్వాసం, ద్రోహం – నేరం – పాపం అగును.
6. **ప్రభుత్వ ఆస్తులు :** పౌరులు ప్రభుత్వ ఆస్తులకు యజమానులు – జాతీయ సంపదను నష్టపరచుట, దురుపయోగముచేయుట, దొంగలించుట నేరము. దేశాన్ని ఆరోగ్యవంతంగా ఉండేట్లు చూడాలి.
7. **ఏకకుటుంబం :** పౌరులందరూ సోదరులు. సోదరభావంతో అందరూ సమైక్యంగా ఉండాలి.
8. **మతం :** మతసహనం – సమభావం ఉండాలి. అలాగే సాంప్రదాయాల యెడనూ. నిన్ను ఇతరులు ఎలా గౌరవించాలనుకుంటావో నీవు ఇతరులను అలా గౌరవించు.
9. **హింసవద్దు :** హింస, ద్వేషాలు విడనాడు. లేకున్న జాతికి ముప్పుయేర్పడును.
10. **ఆర్థిక :** సామాన్య జీవనం – ఉత్తమ ఆలోచనలు అనుసరించాలి. విలాసాలుమాను – దుర్వ్యయంనిరోధించు. బీదబిక్కిని సమాదరించి, వారితో సమంగా పంచుకొని జీవించాలి.
11. **చట్టం :** చట్టాన్ని గౌరవించు. సామాజికన్యాయాన్ని అనుసరించు.
12. **అహింస :** అహింసా పరమోధర్మః ఇతరులను గాయపరచకుండుట ఉత్తమం. దయదైవత్వలక్షణం. భూతదయ పవిత్ర విధి. ఇదీ భారత దేశసందేశం. అనుసరించి అసలైన భారతీయుడవుగమ్ము.
13. **ప్రకృతి : పర్యావరణం :** మానవుడు ప్రకృతి అవిభాజ్యము పరస్పర సంబంధితము.

ప్రకృతిలోని ప్రతిదీమానవ అభివృద్ధికే దోహదం. కనుక పర్యావరణ పరిరక్షణ మనవిధి. క్షేమంగా ప్రగతి పథంలో మానవుడు పయనించడాని కత్యంత అవసరము. గాలి, నీరులను కాలుష్య పరచడం జాతీయనేరం. గతాన్ని సరిదిద్దుకోవాలి.

**ఐక్యత :** అడ్డంకులు అధిగమించి, అపాయాలు నివారించడానికి దేశప్రజలు ఏకంగా ఉండాలి . కలసి ఉంటె సుఖం – విడిపోతే పతనం, నేటి భారతానికిది అత్యవసరం – దేశభక్తి అంటే దేశ ప్రజలపై ప్రేమ ప్రతి పౌరుడు తన భారతదేశానికి అంకితంకావాలి.

**విద్య:** ప్రతి పౌరుడుతన బిడ్డలకు, కుటుంబ సభ్యులకు దేశభక్తి సేవా ప్రవృత్తిని ప్రబోధించాలి. ఆ విధంగా అసలైన పౌరుడుగా దేశసేవలో జీవితాన్ని మలచుకోవాలి. 'దేశభక్తులు'

# ఆర్షవిద్యాపాఠశాల

ప్రియాత్మ బంధువులారా!

కృష్ణాజిల్లా పోరంకి ఏరియా పెనమలూరు శ్రీ పరమాత్మానందా శ్రమంలో **1997** జూలై **18**వ తేది శుక్రవారం నుండి **4** మాసాలు ఆర్షవిద్యా పాఠశాల ప్రారంభించబడును. ఇందులో ఈశ, కేన, కఠ, ముండక ఉపనిషత్తులు, శ్రీమద్భగవద్గీత, యోగసూత్రాలు, సరళసంస్కృత భాషా పరిచయం బోధించబడును. తరగతులు పూజ్య శ్రీశ్రీశ్రీ ఆచార్య శంకరానందగిరి స్వాములవారు స్వయంగా నిర్వహింతురు. అవకాశాన్ని అనుసరించి పురుషసూక్తాది వేదమంత్రాలు, ఇతర అత్యవసర విషయాలు కూడ నేర్పబడును – **20** సంవత్సరాలనుండి **40** సంవత్సరాల వయస్సులోపువారు మాత్రమే ఇందులో చేరే దానికి అవకాశముంటుంది. అవసరమనిపించినచో కాలవ్యవధి ఒకటి రెండు మాసాలు పెంచబడును కనీసం **10**వ తరగతి చదివి ఉండాలి ఇంటర్వ్యూలో నిర్ణయించబడిన వారుమాత్రమే చేర్చుకోబడుదురు ప్రతిష్ఠితమైన ఆశ్రమ సేవకులగు బ్రహ్మచారి, సన్యాసులకు ఉచిత భోజన, వసతి కల్పించబడును. మిగతవారు నిర్ణయించిన రుసుము చెల్లించి చేరవల్సియుండును. విశేష యోగ్యత కలవారు బ్రహ్మసూత్ర, వేందాంత పరిభాష – సంస్కృత వ్యాకరణాదులు నేర్చుకునే దానికికూడ అవకాశముండును – ఇతరవివరాలు, ప్రవేశ పత్రము, ఉత్తర ప్రత్యుత్తరాలకు **25** రూ॥ ఎమ్. ఓ ద్వారా ఈ క్రింది అడ్రసుకు పంపవలయును – చేరగానే ప్రవేశపత్రము వగైరా పంపబడును – ఇంటర్వ్యూ తేదిగూడ నిర్ణయించి తెలుపగలము – స్థానికంగా ఉండేవారు ఎవరైనా శ్రవణం చేసి వెళ్లవచ్చును – రుసుము లేదు–

ఇట్లు
కార్యనిర్వహణ కమిటి, ఆర్షవిద్యాపాఠశాల

ఎమ్. ఓ పంపవల్సిన అడ్రసు, ఆచార్య శ్రీ శంకరానందగిరి స్వాములవారు,
పరమాత్మా నందాశ్రమం– పెనమలూరు – కృష్ణా (జి) ఫోన్: **582813, 521139**

# పూదోట లింగావధూత (17వ శతాబ్దం)

- ఆచార్య బి. రామరాజు

మోక్షం పొందటానికి కర్మ భక్తి జ్ఞాన యోగమార్గాలున్నవి. ఆ మార్గాల్లో మళ్ళీ అనేక భేదాలున్నవి. అద్వైత మార్గానుయాయులైన జ్ఞానులు ప్రకృతిని విజ్ఞానంతో సంస్కరించి పరమపురుషుని (మోక్షాన్ని) పొందటమే పరమలక్ష్యం అంటే, ప్రకృతిని విజ్ఞానంతో సంస్కరించి పరబ్రహ్మను పొందిన తరువాత ఆపరమచైతన్యాన్ని పృథ్వీమండలానికి చేర్చి స్థూలదేహాన్ని కూడ చిన్మయంగా చేయవలెనన్నవారు కొందరు. అట్టివారిలో పూదోట లింగావధూత ప్రముఖులు. గీతాచార్యులు ''అపానే జుహ్వతి ప్రాణం, ప్రాణేఽపానం తథా పరే'' అంటూ సూత్రీకరించిన యోగాన్ని అనుష్ఠించి స్థూలదేహాన్ని చిన్మయం చేసుకున్న అద్భుతయోగి పూదోటలింగావధూత. ఆయన శివకేశవ భేదవాదాన్ని, జాతివర్ణవిభేదాలను, మతమతాంతర భేదాలను తిరస్కరించి, విశ్వమానవజాతి ఏకత్వం ప్రబోధించిన ఉదారుడు. ఆయన హృదయం విశ్వాత్మ కనుకనే తమ సాధనాప్రణాళికను విశ్వప్రజా దృష్టితో మేళవించి, విశ్వమత ద్వారాలు తెరచి, దేశకాల ఖండ జాతి వర్ణవర్గ విభేదాలు విడిచిపెట్టి, విశ్వప్రజలందరికీ తమ సంపూర్ణయోగం బోధించినారు. మహాపురుషులందరూ ఆయాదేశకాల పరిస్థితులను అనుసరించి నాటి సమాజ శ్రేయస్సుకోసమే అవతరిస్తారనిపిస్తుంది. వేమన పోతులూరి వీరబ్రహ్మం యుగావసరాలకై అవతరించిన వారే. పోతులూరివారి కార్యం కొనసాగించటానికి దాదాపు రెండు దశాబ్దాల తరువాత అవతరించి వారి కార్యం పూర్తిచేసినవారు లింగావధూత. 17వ శతాబ్దం నాటికి ఆంధ్రదేశం రాజకీయంగా, సామాజికంగా, ధార్మికంగా, నైతికంగా పతనోన్ముఖంగా ఉండినది. మహమ్మదీయుల మతద్వేషం, హిందువుల్లో వర్ణవర్గ ఉచ్చనీచ భేదాలు, పాళెగాండ్ల సంస్థానాధీశ్వరుల ఆగడాలు, బలుల పేరుతో జీవహింసలు, భౌతిక సుఖాలే సర్వస్వంగా భావించి సమాజాన్ని పీడించే స్వార్థపరుల దౌర్జన్యాలు మితిమీరిన సమయంలో సమాజానికి ఒక ధర్మమార్గాన్ని చూపటానికి వేమన వీరబ్రహ్మం లింగావధూత ఒకరి తరువాత ఒకరు తమ దివ్య సందేశాలద్వారా అద్భుతలీలలద్వారా ప్రజల్లో భక్తి జ్ఞానములు శాంతి ప్రేమలు వ్యాపింపజేసినారు.

కర్నూలు మండలం బనగానపల్లి సమీపాన ఏగంటి అనే గొప్ప శైవక్షేత్రం ఉన్నది. దాని కుత్తరాన కొండల్లో గుహలున్నవి. ఆగుహల్లో ప్రాచీనకాలంనుండి సిద్ధులు తపస్సుచేస్తు ఉంటున్నారు. 17వ శతాబ్దంలో శివరామస్వామి అనే బ్రహ్మవిద్వరిష్ఠుడు తపస్సు చేస్తుండేవాడు. బనగానపల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మ అనే గొప్ప యోగిని ఉండేది. ఆమె మఠాన్ని 'చింతమాను' మఠమంటారు. పోతులూరి వీరబ్రహ్మంగారు తొలిపాఠాలు నేర్చినది ఈ అచ్చమ్మగారి మఠంలోనే. శివరామస్వామి తరచుగా ఈ మఠానికి వచ్చి అచ్చమ్మ ఆశ్రమంలో చురుకైనవారిని ఎంపిక చేసి ఏగంటి గుహలకు తీసుకపోయి వారిని తపస్సంపన్నులుగా మలచేవారు. వీరబ్రహ్మంగా రామఠం విడిచిపోయేముందు అచ్చమ్మతో, కొంతకాలం తరువాత మరొక మహాత్ముడీ మఠానికి వస్తాడని భవిష్యం చెప్పినారు. ఆయన చెప్పినట్లే కర్నూలు మండలం పాలేరునదీతీరాన అవుకు గ్రామంలో సోమిరెడ్డి సోమమ్మ అనే రెడ్డి దంపతులకు ఒక శుభముహూర్తాన స్వప్రకాశమూర్తియైన ఒక మగబిడ్డ జన్మించినాడు. అతనికి లింగమూర్తి అని నామకరణం చేసినారు. ఐదవయేటనుండి అతని ప్రవర్తన వింతగా ఉండినది. జాగృతిలో నిదురిస్తున్నట్లు నిదురలో జాగృతుడైనట్లు ప్రవర్తించేవాడు. అవకాశం

చిక్కినపుడల్లా ఇంటిప్రక్క చెట్టుక్రింద శివనామజపం చేస్తూ జాతిభేదం లేకుండా అందరితో ఆడుకునేవాడు. పక్షులు జంతువులు అతని చుట్టూ మూగేవి. ఆకాశంవైపు చూస్తూ గ్రహతారకలకేదో సందేశమిస్తున్నట్లు సైగలు చేసేవాడు. బాల్యంలోనే హఠాత్తుగా తల్లిదండ్రులను కోల్పోవటంచేత అనాథుడైన లింగమూర్తిని అవుకు గ్రామం పెద్ద, అచ్చమ్మ గారి చింతమాను మఠంలో చేర్పించినాడు. అమ్మ అడిగిన ప్రశ్నలకు లింగమూర్తి చెప్పిన సమాధానాలు విని పోతులూరి వీరబ్రహ్మం చెప్పిపోయిన దివ్యబాలుడీతడే అని ఆమె నిశ్చయించుకున్నది. లింగమూర్తిని ముద్దాడి కౌగిలించు కున్నంతనే అచ్చమ్మకు మనోవృత్తులు లయమై శుద్ధాద్వైతానందం కలిగింది. మరునాడు ఏగంటి శివరామస్వామి గురుడు వచ్చి లింగమూర్తి దివ్యత్వం గుర్తించి అచ్చమ్మకు నచ్చజెప్పి ఆతణ్ణి జుత్తేరుకు తీసుకపోయినారు. ఇద్దరూ ఏటిలో స్నానం చేసిన తరువాత గురుడు లింగమూర్తికి మంత్రోపదేశం చేసి ఒక యేడాది అచ్చమ్మవద్దనే ఉండవలసిందనీ తరువాత ఏగంటి గుహలకు తీసుకపోయి సకలయోగవిద్యానిధిగా చేస్తామనీ అన్నారు. లింగమూర్తి అచ్చమ్మ లాలనపాలనలో మఠంలో పూజాదికముల్లోను, బయట గోపాలనంలోను ఏడాది గడపినాడు. ఏడాది పూర్తికాగానే శివరామస్వామివచ్చి లింగమూర్తిని తోడ్కొని తమ శివలింగ గుహకు తీసుకపోయినారు.

లింగమూర్తి శివరామగురువులతోపాటు బ్రహ్మముహూర్తంలో లేచి లఘుప్రాణాయామం ధ్యానం చేసి స్నానానంతరం అగ్నికార్యం ముగించి గుహలోని లింగానికి అభిషేకం చేసి జపధ్యానాలు ముగించి భక్తులంపే ఆవుపాలు త్రాగేవారు. మధ్యాహ్నందాక గురువుల చెంత శాస్త్రాధ్యయనం చేసి మిట్టమధ్యాహ్నం గురువులతో పాటు పేలపిండిగాని రాగిపిండిగాని తినేవారు. మూడవ జామున బ్రహ్మవిద్యాబోధ జరిగేది. సాయంకాలం అడవిలో సమిధలేర బోయేవారు. ఈ విధంగా లింగమూర్తి క్రమశిక్షణతో గురువులసేవించి శీఘ్రకాలంలో సమస్తరహస్యాలు ఆకళింపు చేసుకున్నాడు. ఒకనాడు లింగమూర్తి సమిధలకై పోతూ ఎండతాకిడికి డస్సి చెట్టునీడన నిద్రించినాడు. సూర్య పరిభ్రమణంతో చెట్టునీడ జరిగిపోయింది. ఒక నాగుపాము వచ్చి లింగమూర్తికి ఎండతాకకుండా పడగ నీడ పట్టింది. అది గమనించిన శివరామ గురుడు లింగమూర్తికి హంసవిద్య నేర్పినారు. లింగమూర్తి త్వరలోనే ఆ విద్య సాధించినారు. ఒకనాడు లింగమూర్తి గుహబయట గురువు కోసం కోసిన పండు పెద్దకోతికి తినిపిస్తుండగా చూచిన ఇతర శిష్యులు శివరామగురునికి విన్నవిస్తే ఆయన వచ్చి ఆవింత చూచి ఆంజనేయస్తవం చేయగనే ఆకోతి ఆంజనేయుడుగా ప్రత్యక్షమై లింగమూర్తి తన అంశతో పుట్టిన కారణజన్ముడనీ, అతనికి గురువు కావటం శివరామ స్వామి అదృష్టమనీ, లింగమూర్తి చేత జరుగవలసిన భవిష్యత్కార్య క్రమం చెప్పి అంతర్హితుడైనాడు. గురువులు లింగమూర్తికి ఆత్మలింగభేదనం బోధించినారు. లింగమూర్తికి స్వస్వరూప విశ్వరూప సాధనా ప్రణాళిక సంపూర్ణమై అనుభూతికి వచ్చింది. జపధ్యానాలలో ప్రాణగ్రంథి రుద్రగ్రంథులు విడిపోయినవి. అనగా ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు విడిపోయినవి. నిరాకార నిర్గుణలక్షితమైన సాధనలో చిత్తుసత్తులను అధిగమించి మహానందానుభూతి పొందినారు. ఈ విధంగా యోగభూమిక లధిరోహిస్తూ గురుసేవలో ఉన్న లింగమూర్తిని చూడటానికి ఒకనాడు గరిమి రెడ్డి అచ్చమ్మ గురుశిష్యులకు నూతన వస్త్రాలు తీపివంటకాలు పట్టుకవచ్చి సమర్పించింది. శివరామ స్వామి అచ్చమ్మను ఏకాంతానికి తీసుకపోయి లింగమూర్తి మహిమలు ఆతనిగొప్పతనము యోగసాధన వివరంగా చెప్పినారు. కొన్నిదినాల

తరువాత లింగమూర్తిని సమిధలేరే పని మాన్పించి కేవలపరతత్త్వమును బోధించినారు. గురువుల ఆదేశం మేరకు లింగమూర్తి రేయింబవలు అనేకమాసాలు ధ్యాన నిష్ఠుడై పరావమూల శక్తి (మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి) కృపకు పాత్రుడైనాడు. ఆయన ధ్యానము ధ్యేయము ఒక్కటైపోయినవి. ఆయన పురోగతికి మెచ్చి గురువు దృశ్యభేదన యోగం బోధించినారు. దానితో లింగమూర్తికి సంపూర్ణాద్వైతం సుస్థిరమైనది. దాని తరువాత గురువులు చైతన్యజడసంధాన చిన్మయయోగం బోధించినారు. ఆయోగసాధనలో సఫలుడైన లింగమూర్తి చిన్మయ లింగమూర్తి ఐనాడు. ఆయన యోగవిద్య పరిపూర్ణమైనది. ఇక చెప్పవలసినది గురునికీ లేదు, నేర్వవలసినది శిష్యునికీ లేదు. ఈ విధంగా లింగమూర్తికి గురు శుశ్రూషలో 12 ఏండ్లు గడచినవి. ఇప్పుడాయన వయస్సు 20 ఏండ్లు.

శివరామ గురుడు శిష్యుణ్ణి చేరదీసి ''వత్సా! కేవల పరమ చైతన్యావతారుడవైన నీవు ఇకనుండి ప్రజలనుద్ధరించవలసిన కార్యం చేపట్టవలసి ఉంటుంది. నీకంటె ముందువాడైన వీరబ్రహ్మం ఒక వైపు నీవొకవైపు మీ రచనలతో ప్రబోధలతో సమాజాన్ని సంస్కరించి ధర్మమార్గాన నడిపించండి. నీకోసం పూదోట గురుపీఠం స్థాపిస్తున్నాను. నీవు ఆ పీఠానికి ప్రథమాధ్యక్షుడవు. నీకు పూదోట లింగావధూత అని నామకరణం చేస్తున్నాను. నీవు స్థాపించేది విశ్వమతం. వేదాలను వేద మతాన్ని సంకెళ్ళనుండి విడిపించి విశ్వమానవాళికి అందుబాటులోనికి తేవాలె. నీకీర్తిచంద్రికల్లో కొంతకాలం ఓలలాడి నేను తనువు చాలిస్తాను. నీకీర్తి ఆచంద్రార్కం ఉంటుంది.'' అంటూ ఆలింగనం చేసుకొని సర్వశక్తులను శిష్యుని హృదయంలో ప్రతిష్ఠించినారు. ఆ సాయంకాలమే చింతమాను మఠంనుండి అచ్చమ్మగారు వచ్చినారు. లింగావధూత తన మొదటి గురువు అచ్చమ్మకు రెండవ గురువు శివరామ స్వామికి సాష్టాంగ పడి కృతజ్ఞతలు తెలుపుకున్నారు. ఆ యిరువురి పాదధూళి శిరమున ధరించి ఇన్నాళ్ళు తాను నివసించిన గుహామాతకు అక్కడి దేవుడు ఉమామహేశ్వరునికి ప్రణమిల్లి అచ్చమాంబ వెంట ప్రయాణమైనాడు. గురువును గురుదక్షిణ ఏమీయవలనని అడిగితే ఆయన ''విశ్వప్రజలందరికీ జాతి వర్ణలింగభేదాలు లేకుండా తత్త్వ విద్య బోధించి విశ్వమతాన్నీ, విశ్వమానవ సమాజాన్ని నిర్మించటమే నాకు గురుదక్షిణ'' అంటూ దీవించి సాగనంపినాడు. లింగావధూత రెండుదినాలు అచ్చమ్మగారి వద్ద ఉండి ఆమెసెలవంది రవ్వలకొండపైకి చేరినారు.

జుట్టేరుకు దక్షిణాన బనగానపల్లెకు పశ్చిమనైరుతీ దిశల్లో వ్యాపించిన ఎఱ్ఱమలను రవ్వలకొండ అంటారు. పూర్వం అక్కడ వజ్రాలగనులుండేవి. ఇప్పటికీ వానకాలం అప్పుడపుడు అక్కడ చిన్నరవ్వలు లభిస్తుంటాయి. ఆరవ్వలకొండగుహల్లో లింగావధూత కౌపీనమాత్రధారియై ఉండేవారు. రవ్వలేరు కోవటానికి వచ్చే పేదవారు పెట్టేది తినేవారు. ఆయన పిచ్చివాడని ఆయన చేత మంచినీళ్ళకుండలు మోయించి ఆపేదవారు ఆయనకింత అన్నం పెట్టేవారు. ఒకనాడు సాయంకాలం ఒక పేదవాడు రవ్వలు లభించక, ఇంటికి పోలేక, ఇంటికిపోతే అప్పులవారి బాధకు, భార్యా బిడ్డలు ఆకలితో అలమటించే బాధకు తట్టుకోలేక ఆత్మహత్యకై పూనుకున్నాడు. లింగావధూత వాని ప్రయత్నం మాన్పించి వాని గోడు విని, జాలి తలచి, ఒక బండక్రిందికి తమ చేయి చాచి పెద్దపెద్ద మేలి వజ్రాలు తీసి ఇచ్చినారు. ఆపేదవాడు తన అప్పులన్నీ తీర్చుకొని గొప్ప శ్రీమంతుడైనాడు. తనకు వజ్రాలిచ్చిన పిచ్చివానివైనం అందరికీ చెప్పినాడు. ఆనాటినుండి బనగానపల్లెనుండి చుట్టుప్రక్కల గ్రామాలనుండి ప్రజలు చీమల బారులవలె లింగావధూత స్వామి దర్శనానికి రాసాగినారు. లింగావధూత మాహాత్మ్యం ఆనోట ఆనోట పడి చివరకు బనగాన పల్లె

నవాబుకు తెలిసిపోయింది. అవధూతను పరీక్షించటానికై నవాబు ఒక చూడి గుఱ్ఱం ఎక్కి సపరివారంగా రవ్వలకొండ చేరి ఆయనకు నమస్కరించి తానెక్కివచ్చిన గుఱ్ఱం గర్భంలో ఉన్నపిల్ల ఏలింగం ఏవర్ణం ఏలక్షణాలు కలదో చెప్పుమన్నారు. స్వామి తమ దివ్యదృష్టితో చూచి ఉన్నదున్నట్లు చెప్పినారు. దయాదూరుడైన ఆనవాబు తన కత్తితో గుఱ్ఱంతల నరికి దాని పొట్ట చీల్చి కడుపులోని పిల్లను బయటికి తీయించినాడు. స్వామి చెప్పినట్లే ఉన్న గుఱ్ఱం పిల్లను చూచి నవాబు స్వామి శక్తికి ఆశ్చర్యపడి మరొకసారి వందనం చేసినాడు. స్వామిని తమ సంస్థానంలోనే ఉండి పొమ్మనీ ఒకఅగ్రహారం ఇస్తామనీ అప్పుడప్పుడు దర్శనానికి వస్తామనీ చెప్పితన నగరుకు వెళ్లిపోయినాడు. నవాబు క్రూరచర్యకు అవధూత స్వామి చింతించి ఆగుఱ్ఱానికి ఉత్తమగతికై ప్రార్థించి దానికళేబరానికి దహన సంస్కారం చేయించి దానిభస్మంకొంత ధరించి కొంత మూట గట్టుకొని అర్ధరాత్రి శ్రీశైలం మహానంది మార్గాన ఈశాన్య దిశగా పయనమైపోయినారు. తెల్లవారే వరకు కానాల గ్రామం సమీపాన ఒక నీటిగుంట దరిచేరినారు. అక్కడొక పెద్దచెట్టూ, చూట్టూ ముండ్ల పొదలున్నవి. అది తమ ఏకాంతానికి అనువైన స్థలంగా ఎంచుకున్నారు.

కానాలగ్రామంలో లక్ష్మమ్మ అనే రైతు మహిళ సుశీల. ఆమె దయాదాన ధర్మగుణాల ప్రోవు. ఆయమ్మకు పాడిపశువులున్నవి. వాటిని మేపటానికి ఒక కుఱ్ఱవాడున్నాడు. ఒకనాడు మేతకు పోయిన ఆవుల్లో పెద్దావు తప్పించుకొని లింగావధూతగారున్న చెట్టుక్రింద చేరి స్వామిని తదేకంగా చూస్తూ కన్నీరు కారుస్తున్నది. దానికోసం వెదకి చివరకు కనుగొన్న ఆకుఱ్ఱవాడు లింగావధూత గురించీ ఆవు ప్రవర్తన గురించీ లక్ష్మమ్మకు చెప్పినాడు. ఆయమ్మ మరునాడు మధ్యాహ్నం ఒక ముంతలో అంబలి మరొక ముంతలో మంచినీళ్ళు తీసుకపోయి స్వామిముందుంచి చాలాసేపు కూర్చున్నది. స్వామివారి ముఖమండలప్రకాశం పారవశ్యంతో జాము సేపు చూచింది. స్వామి కనులు తెరువలేదు. వారి ధ్యానానికి భంగం కలుగకుండా లక్ష్మమ్మ ఇంటికి తిరిగివచ్చింది. మరునాడు రెండు జాములప్పుడు అన్నమూ నీళ్ళూ రెండు ముంతల్లో తీసుక పోయిపెట్టింది. నిన్న తాను పెట్టిన ముంతల్లో స్వామి కొద్దిగా తిని కొంత ప్రసాదంగా మిగిల్చినవి ఇంటికి తెచ్చుకున్నది. ఇట్లా ఆమె ప్రతిదినం అన్నమో అంబలో ఏదో తీసుకపోయిపెట్టి వచ్చేది. కొన్నాళ్ళకు వర్షాభావం చేత ఆప్రాంతంలో క్షామమేర్పడింది. పశువులకు మేతలు ప్రజలకు త్రాగేనీళ్ళు లేవు. ఆ గ్రామం రైతులు తమ పశువులతో వలసపోయే పరిస్థితి ఏర్పడింది. లక్ష్మమ్మ తానుకూడా వలసపోవటానికి నిశ్చయించుకొని అన్నం నీళ్ళముంతలతో స్వామి సన్నిధికి పోయి ఇక స్వామిని సేవించే భాగ్యానికి దూరమౌతున్నానుగదా అనే బాధతో ముఖాన కొంగు పెట్టుకొని భోరున ఏడ్చింది. కరుణాళువైన లింగావధూత కనులు తెరచి దుఃఖకారణ మడిగినారు. ఇన్నాళ్ళకు స్వామి తనను పల్కరించినందుకు సంతోషము, స్వామిని విడిచి పోతున్నందుకు దుఃఖము ముప్పిరిగొన్న లక్ష్మమ్మ తన దుఃఖకారణం చెప్పింది. స్వామి మందహాసం చేసి వలస పోనక్కరలేదనీ వానపడుతుందనీ శ్రీరామానుగ్రహంతో కరువు తీరుతుందనీ ధైర్యం చెప్పి ఆమెనింటికి పంపినారు. స్వామి శ్రీరామచంద్రునుద్దేశించి ''శ్రీరామా! కన్నవిన్నవారిలోను నను కన్నడజేయకె రామా'' అంటూ ఒక కీర్తన పాడినారు. కుండపోతగా వాన కురిసింది. వాగులు వంకలు కుంటలు బావులు నిండి ఏక జలరాశి ఐనది. ఈహఠాత్పరిణామం శ్రీ అవధూత స్వామి కృపావృష్టి అని లక్ష్మమ్మ గ్రామంలో చాటింది. అప్పటినుండి కానాల ప్రజలందరూ స్వామిని దర్శించి పోతుం డేవారు. కొన్ని దినాలకు సాధుసంతులు కూడ వచ్చి ఆ చెట్టు నీడన చేరినారు. వాళ్లు గ్రామాల్లో తిరిగి భిక్షించినఅన్న తినేవారు. లక్ష్మమ్మ యింటినుండి స్వామికి ప్రసాదం ఎప్పటివలె వస్తుండేది.

(సశేషం)

# ఆదిత్యహృదయం

(గతసంచిక తరువాయి) —డా॥ అల్లూరి వెంకటనరసింహరాజు

''ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్'' అన్నది ధ్యాన శ్లోకం. మొత్తం మీద ఆదిత్య హృదయం, సహస్రాక్షర సంయుతమైన మహా మంత్రం! సూర్యునికి వృద్ధిక్షయాలు లేవు. కనుక ఆయనకు ప్రాదుర్భావమే లేదు. చంద్రునికి కళా వృద్ధి క్షయాలున్నాయి. అందువల్ల ఆయనకు పునర్జన్మ ఉన్నట్లే. సూర్య చంద్రులు పరమాత్మ జీవాత్మలకు ప్రతీకలు!

సూర్యుడు నిగ్రహానుగ్రహసమర్థుడు. ప్రాణి కోటిని తొలుత తన ప్రచండ కిరణాలతో తపించి, తిరిగి వర్షాలు కురిపించి, జీవరాశిని, పునః సృష్టిస్తాడు. లోకంలో సృష్టి–నాశనము ఒకదాని వెంట నొకటి సంభవిస్తూ ఉంటాయి. ఉదాహరణకు మనం చెఱకు తోటలను చక్కగా పెంచుతాం. బాగా పెరిగిన తర్వాత, నరికి వేసి, వాటి మొదళ్ళను నిప్పు పెట్టి మరీ నాశనం చేస్తాం. అలా చేస్తే తప్ప మొక్కలు మళ్ళీ చక్కగా పెరగవు. కనుక నూతన సృష్టి జరగాలంటే ముందు సంహరణ క్రియ జరిగి తీరాలి. అందువల్లనే, లయకారకుడైన ఈశ్వరుణ్ణి మనం శివునిగా పూజిస్తాము.

సూర్యుడు సర్వలోక ప్రభువు. ఆదర్శ ప్రభువు, తన ప్రజలు బాధ పడుతున్నా కొంత పన్నును వసూలు చేసి, అందుకు వెయ్యిరెట్లు విలువగల ఆరోగ్యాన్ని, రక్షణను, పోషణను కల్పిస్తాడు. అలాగే సూర్యుడు గ్రీష్మ ఋతువులో ప్రాణికోటిని తపించి, భూమి నుండి కొంత జలాన్ని సంగ్రహించి, వేయిరెట్లు పెంచి, వర్షాలు కురిపించి, సస్యాలు చక్కగా పెరిగేటట్టు చేసి, జీవకోటికి ఆహారాన్ని, ఆరోగ్యాన్నీ సమకూరుస్తాడు.

శత్రువులంటే లోక జీవన విధానానికి హాని కలిగించేవారు. రోగ కారకమైన క్రిములు నిజంగా ప్రపంచ శత్రువులే! వాటిని నశింప జేసి, జగత్కల్యాణం కలిగించడమే ఆదిత్యుని నిత్యకృత్యం.

సూర్యునికి 'అగ్ని గర్భుడు' అనే పేరుంది. ''అగ్ని గర్భ'' అంటే శమీ వృక్షం అనే అర్థం కూడా ఉంది. అది కూడా సూర్య శక్తి వంటి శక్తిగల వృక్షం. అందువల్లనే సూర్యరశ్మి మనకు సరిగా అందని ఆశ్వీయుజ మాసంలో దానిని పూజిస్తాం.

ఆదిత్య హృదయం జయావహం. జయాన్ని కలిగిస్తుంది. అంటే తల పెట్టిన కార్యాన్ని సాధించే వరకు ఉపాసకునికి, శారీరక, మానసిక దౌర్బల్యాలు కలుగకుండా చేస్తుందని అర్థం.

ఆదిత్యుడు భౌతికంగా, మానవుని నిద్ర నుండి మేల్కొలుపుతాడు. ఆధ్యాత్మికంగా అజ్ఞానాంధకారాన్ని తొలగించి, జ్ఞాన జ్యోతిని ప్రసాదిస్తాడు. చైతన్య రహితమైన మృత్పిండాన్ని, ఆత్మస్వరూపునిగా తీర్చి దిద్దుతాడు.

(సశేషం)

# ౨. విశ్వం (Universe) ఆవిర్భావం

విశ్వం (universe) ఏర్పడిన విధానాన్ని గురించి మన హైందవ పురాణ గ్రంథాలు స్పష్టమైన విజ్ఞానాన్ని అందిస్తున్నాయి. అదంతా తెలుసుకునే ముందుగా, విశ్వం ఆవిర్భావం గురించి మన ఆధునిక సైన్సు ఏం చెప్తుందో చూద్దాం.

## బిగ్‌బ్యాంగ్ సూత్రం :

మొదట్లో ఈ నక్షత్రాలూ, గ్రహాలూ ఏవీ ఉండేవి కావట. అవన్నీ కలసి ఒకే ముద్దగా, అగ్నిగోళంగా ఉండేవట. దాన్నే మన ఋషులు ''బ్రహ్మాండం'' అని వ్యవహరించారు. ఏదో ఒక అద్భుతమైన శక్తి (Super Power) వల్ల ఆ అగ్నిగోళం (అనగా బ్రహ్మాండం) ప్రేలిపోయిందట. దీన్నే ఆధునిక శాస్త్రవేత్తలు 'బిగ్‌బ్యాంగ్' అంటారు. ఆ ప్రేలుడుతో బ్రహ్మాండమనే అగ్నిగోళం - నక్షత్రాలు, గ్రహాలుగా దూరదూరాలకు చెదరిపోయింది. ఆ ప్రేలుడుతో కలిగిన విసురుడు శక్తివల్ల ఇప్పటికీ విశ్వంలోని నక్షత్రాలన్నీ కూడా గ్రహాలతో సహా దూరంగా అలా సాగిపోతూనే ఉన్నాయి. ఆధునిక సైన్సు ప్రకారం విశ్వం ఏర్పడిన మరియు నడుస్తున్న వైనం ఇదే! ఇదే బిగ్‌బ్యాంగ్ సూత్రం.

## విశ్వముకుళిత సూత్రం:

మరిన్ని కోట్ల సంవత్సరాలకు బ్రహ్మాండం ప్రేలుడుకు సంబంధించిన విసురుడు శక్తి తగ్గిపోతుంది. అప్పుడు బ్రహ్మాండం యొక్క కేంద్రస్థానం, పైన తెలిపిన అద్భుతమైన శక్తి (Super Power) సహాయంతో మొత్తం నక్షత్రగ్రహాదులను వెనక్కి ఆకర్షించుకుని మళ్ళీ ''బ్రహ్మాండం''గా, అంటే ఒక ''అగ్నిగోళం''గా రూపుదాలుస్తుంది. విశ్వముకుళిత సూత్రంగా చెప్పబడిన ఈ సిద్ధాంతాన్ని కూడా ఆధునిక శాస్త్రజ్ఞులే చెప్తున్నారు. మళ్ళీ చాలాకాలం తర్వాత బ్రహ్మాండం ప్రేలుతుంది. మళ్ళీ ముకుళితమౌతుంది. ఇది ఇలా కొనసాగుతూనే ఉంటుందట. విశ్వం ఆవిర్భావం గురించి ఆధునిక విజ్ఞానం చెప్తున్న విషయాలివి.

అయితే పైన విషయాలన్నీ కూడా పురాణ పరిభాషలో మనకు ''దేవీ భాగవతం''లో కన్పిస్తున్నాయి. ఆ వివరాలు చూద్దాం. ఆధునికులు చెప్పిన బ్రహ్మాండమనే అగ్నిగోళాన్ని ''వటపత్రశాయి'' (అంటే శ్రీ మహావిష్ణువు)గా వర్ణించారు మహా ఋషులు. ఆదిలో ఒంటరిగా ఒక మర్రి ఆకుపై బాలుని రూపంలో వటపత్రశాయి (అనగా విష్ణువు) ఉన్నట్లుగా చెప్పారు వారు. అప్పుడు జగన్మాత అయిన ఆదిశక్తి (Super Power) ఆజ్ఞపై విష్ణువు తన శరీరం నుండి ఈ సకల విశ్వాన్నీ సృష్టించాడట. అది అనంత విశ్వంగా వ్యాప్తి చెందుతోంది. ఆధునికుల బిగ్‌బ్యాంగ్ సూత్రం ఇదే! బ్రహ్మాండం ప్రేలుడుకు కారణంగా నేటి శాస్త్రవేత్తలు చెప్తున్న ఆ అద్భుతశక్తి (Super Power)నే మన పురాణాల్లో '' ఆదిశక్తి'' అని వ్రాశారు. (విద్యుదయస్కాంత శక్తి, గురుత్వాకర్షణ శక్తి, ఉష్ణశక్తి, అణుబంధన శక్తి మొదలైన శక్తుల కలయికే పురాణాలు చెప్తున్న '' ఆదిశక్తి''! సకల విశ్వానికీ మూలమైన దైవశక్తి ఇదే!!) కొన్ని కల్పకాల అనంతరం (అంటే అనేక కోట్ల సంవత్సరాల తర్వాత) ఆదిశక్తి ఆజ్ఞతో తిరిగి సమస్త విశ్వాన్నీ

మహావిష్ణువు తనలో లీనం చేసుకుంటాడని కూడా దేవీ భాగవతం చెప్తోంది. ఈవిధంగా ఆధునికులు చెప్పిన 'విశ్వ ముకుళిత సూత్రం' కూడా మనకు అతి ప్రాచీనమైనదే! తిరిగి సృష్టి జరగడం .... మళ్ళీ లయం కావడం .... ఇలా ఇది ఎదురులేని నిరంతర కార్యక్రమం అని మన పురాణాలు కూడా చెప్తున్నాయి.

విశ్వ (Universe) ఆవిర్భావం గురించి ఆధునిక శాస్త్రవేత్తలు చెప్పినదీ, మన దేవీ భాగవతం చెప్తున్నదీ ఒక్కటే! కాకపోతే మన ప్రాచీన విజ్ఞానులు, ప్రతి సైన్సు విషయాన్నీ ఆధ్యాత్మిక పరంగా మార్చి వివరిస్తారంతే!

–పోలిశెట్టి బ్రదర్స్
(పురాణాల్లో సైన్సు నుండి)

---

# వి.హిం.ప. సేవాప్రకల్పాలు

వి.హిం.ప. అఖిల భారత సేవా ప్రముఖ్ శ్రీ సీతారామ్ అగర్వాల్ గారితో 20.5.97. 'విశ్వహిందు' సంపాదకులు )

దేశ వ్యాప్తంగా విద్యాసంస్థలు, ఆరోగ్యకేంద్రాలు, స్వయం ఉపాధికేంద్రాలు, సాంఘిక సంక్షేమ పథకాలు, ఇతరాలు మొ॥ మొత్తం 2070 సేవా ప్రకల్పాలున్నట్లు ఓ. ప్రశ్నకు సమాధానంగా వివరించారు శ్రీ సీతారాం అగర్వాల్ గారు.

(ప్రాంతాల వారీ వివిధ ప్రకల్పాలు వివరణ వచ్చే సంచికలో)

అనాధ బాల బాలికలు మొత్తం 3500 మంది వరకూ సహాయ, సహకారాలు పొందుతున్నట్లు తెలిపారు. సేవా ప్రకల్పాలలో దేశ వ్యాప్తంగా 800 మంది పూర్తి సమయ కార్యకర్తలు పనిచేస్తున్నారుట. అందులో 150 మంది ఒక్క రాజస్తాన్‌లోనే ఉన్నారు అన్నారు. మరో ప్రశ్నకు జవాబుగా : ఆంధ్రప్రదేశ్‌లో (పూర్వ + పశ్చిమ)

విద్యాసంస్థలు – 64; ఆరోగ్య కేంద్రాలు – 14; స్వయం ఉపాధి కేంద్రాలు – 5; సాంఘిక సంక్షేమ కేంద్రాలు; 22; పూర్తి సమయ కార్యకర్తలు (సేవారంగంలో) 4 ఉన్నట్లు (1995 –96కు) తెలిపారు. రాజస్థాన్‌లో ఇతర రాష్ట్రాలకన్నా ఎక్కువ సేవా ప్రకల్పాలున్నాయన్నారు. సేవద్వారా సమాజ విశ్వాసాన్ని ఎలా చూరగొంటున్నారనగా: నిస్వార్థ సేవ, వి.హిం.ప. ప్రపంచ ప్రఖ్యాత సంస్థ అన్న యిమేజ్, మతమార్పిడులు ( ముస్లిం, క్రైస్తవుల చేసే) ఆపడం – ముస్లిం, క్రైస్తవులను హిందూ ధర్మంలోనికి మార్చడం, మొదలైన కార్యక్రమాలతో సమాజ విశ్వాసాన్ని పొందాం అంటూ ప్రత్యేకంగా అస్సాంలో వి.హిం.ప. 'హిందూమిషన్'గా పేరు తెచ్చుకుందన్నారు.

మరి అచట బోడోలు... అనగా, అది రాజకీయ కుతంత్రం అన్నారు.

చివరగా :

సేవా ప్రకల్పాల అభివృద్ధికి సూచనలుగా విస్తృతంగా విద్యాసంస్థలు, హాస్టళ్ళు, బాల సంస్కారకేంద్రాలు, ఏకోపాధ్యాయ పాఠశాలలు, ధార్మిక కార్యక్రమాలు నిర్విరామంగా నిర్వహించాలన్నారు. అలాగే ఆరోగ్య కేంద్రాలు బాగా పనిచేసేలా చూడాలన్నారు. – సం.

# పరిప్రశ్న




బ్రాహ్మీముహూర్తం అంటే ఏమిటి ?

– కె. రాజమణి, కరీనగరం

1. ''బ్రాహ్మీముహూర్తమ్'' అని సవరించాలి. బ్రాహ్మీ = పరంబ్రహ్మను పొందుటకు సంబంధించిన సాధనకు, ముహూర్తమ్ = సమయం = నిర్ణయించబడిన కాలం. సూర్యోదయమునకు పూర్వమున్న రెండు గంటలకాలం బ్రాహ్మీముహూర్తం. ఈ కాలంలో కర్మానుష్ఠానము గావించి సూర్యునికి అర్ఘ్యం విడుచుట, సూర్యదర్శనం చేయాలి. మిట్టమధ్యాహ్నం 12 గంటలకు క్లుప్తమైన అనుష్ఠానంతో సూర్యునికి అర్ఘ్యం విడుస్తారు. సూర్యాస్తమయమునకు పూర్వం రెండుగంటలు కూడా అనుష్ఠానకాలం. ఈ త్రిసంధ్యాకాలములుకూడా కర్మకాండపరంగ బ్రాహ్మీముహూర్తములే. తత్త్వజ్ఞానపరంగ బ్రహ్మతత్త్వ సాధనపరంగ సద్వినియోగ కాలములు = సమయములన్నీకూడా బ్రాహ్మీముహూర్తములే. అయితే కర్మకాండపరమైనా, తత్త్వజ్ఞానపరమైనా ముహూర్తమన్న పదం ఒక నియమాన్ని నియమిస్తున్నది. ముహుః + ఉ + ఋతమ్ = ముహూర్తమ్. ముహుః = మరల, ఉ = ఆజ్ఞగ, ఋతమ్ = సాధనను సత్యంగ ఋజువు చేయుట. అనుష్ఠానకాలంలో = ఆచరణకాలంలో బ్రహ్మతత్త్వసాధన సత్యంగ దృఢం చేసుకుంటేనే అది బ్రాహ్మీముహూర్తం అనబడుతుంది. అట్లు కానిపక్షంలో అది అశ్రద్ధకు ముహూర్తం అవుతుంది.

2. శ్రీకృష్ణుడు గీతలో 4వ అధ్యాయం 8వ శ్లోకంలో సాధురక్షణ, దుష్టశిక్షణకై నేను అవతరిస్తానన్నారు. 2వ అధ్యాయంలో నేను పుట్టలేదు, మరణించుట లేదు అంటారు. 9వ, అధ్యాయం 29వ శ్లోకంలో నాకు ప్రియిష్టుడు లేడంటాడు. ఇవి విరుద్ధవాక్యాలు కావా? – ఎల్.పి. చంద్రా కొత్తపేట.

జ. స్థూలదృష్టితో = లౌకికదృష్టితో చూస్తే భగవద్గీతలోని వాక్యాలు విరుద్ధములుగ తోచవచ్చును. తత్త్వదృష్టితో పరికిస్తే భేదం అనేది బొత్తుగ లేదు. జగత్తు, సంసారము, కోరికలు సత్యమనే వ్యావహారికసత్తా పరంగ చెప్పినా....చూచినా భగవద్గీతలో ఇంకా చాల విరుద్ధవాక్యాలున్నట్లు కనపడుతుంది. బ్రహ్మము, ముక్తి, నియబద్ధమైన సాధన, తత్త్వదృష్టి సత్యం అనే పారమార్థికసత్తా దృష్టిలో చెప్పినా చూచినా విరుద్ధం లేశమాత్రంకూడా కనపడదు. ప్రశ్నమేరకు వివరించాలన్న ఈ సమాధానం ఒక గ్రంథం అవుతుంది. శ్రీకృష్ణానంద మఠం ప్రచురించిన ''శ్రీమద్భగవద్గీతోపనిషత్తులు'' టీకా–తాత్పర్యసహితమైన గ్రంథాన్ని చదివిన భవిష్యత్తులో రాజోయే సందేహాలన్నీ కూడా తీరిపోతవి. ఊహించని విశేషాలన్నీ కూడా తెలుస్తుంది.

3. ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం ఏమిటో వివరించ ప్రార్థన – టి. నాగేంద్రశిరోమణి.

జ. (1) జీవుడు బ్రహ్మము ఎన్నటికీ వేరే, బ్రహ్మమును చేరినా జీవుడు రెండవ రూపంగ = ద్వైతరూపంగానే ఉంటాడు – ఇది ద్వైతసిద్ధాంతం. (2) జీవుడు వాస్తవంలో బ్రహ్మమే, వేరుకాదు. బ్రహ్మముకంటె వేరనబడే జీవుడు, జగత్తులకు ఉనికి ఉండదు – ఇది అద్వైతసిద్ధాంతం.

(3) బహ్మము జీవుడు జగత్తు మూడు వేరువేరుగ సత్యములు. జీవుడు జగత్తును భోగిస్తూ బ్రహ్మమును శరణుజొొచ్చాలి. బ్రహ్మమునకుకూడ జగత్తుతో సంబంధం ఉన్నది. ఇది విశిష్టాద్వైతసిద్ధాంతం. బ్రహ్మము, జీవుడు, జగత్తులను స్థూలబుద్ధితో స్థూలంగ ఊహించుకుని చేసినది మతవిభాగం. నిజమైన అద్వైతం ప్రస్తుతం ప్రచారంలో లేదు, మరుగున పడిపోయింది. జీవునికంటె నీచంగ బ్రహ్మమును సంసారిగానూ కామకాముునిగానూ మూడు మతములూ ప్రచారం చేస్తున్నయ్. ప్రస్థానత్రయం (భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు) ప్రబోధిస్తున్న (Practical) ఆచరణాత్మకమైన అద్వైతతత్త్వం ప్రచారంలో ఉంటె దానికి ప్రతిపక్షంలో నాస్తికమతం కూడా ఉండదు. ఇక ఇతరమతములు ఉండవని వేరే చెప్పాలా? ఇప్పటి అద్వైతమతం కూడా నిజఅద్వైత తత్త్వాన్ని అంగీకరించదేమో! ఎందుకంటె నిశితమైన విచారణ - వివేకములు కావాలి. అభిమాన అహంకారములు అడ్డురాకూడదు.

నిరాడంబరం బ్రహ్మరూపం. దీనికి ఆడంబరం, మొదలైన ఇతరరూపాలు = ద్వైతరూపాలు = రెండు రూపాలు ఊహలోకూడా ఉండలేవు. ఆడంబరం జీవుని రూపం. మానవునికి ఆడంబరం తనను సంస్కరించుకోని రూపం, నిరాడంబరం తనను సంస్కరించుకున్న రూపం. ఎంతకష్టమైనా తనను తాను సంస్కరించుకుని ఆడంబరం అనే జీవభావాన్ని విడిచి నిరాడంబరమనే బ్రహ్మభావాన్ని తనకు అద్వైతరూపంగ పొందవచ్చును. ఈవిధంగ జీవుడు బ్రహ్మమే వాస్తవానికి, వేరుకాదు, వేరైన జీవుడు కాడు. ఆడంబరం అనేదిరాయి, రప్పల వలె పదార్థమేమీ కాదు ఉన్నదనటానికి, మనిషి కల్పించుకున్నదే. ఇక జీవుడు - జగత్తులు అబద్ధం అని అర్థమైందా?

అసలు నిజం చూద్దాం. అద్వైతం అంటె, ఎక్కడో బ్రహ్మ ఉంటె, అటువంటి బ్రహ్మకంటె వేరుగ ఎక్కడో ఉన్నాడనబడే జీవుడూ, ఉన్నదనబడే జగత్తూ సత్యమూ అని తర్జనభర్జనలు చేసి మతాలు స్థాపిస్తారు. తనకు నద్వైతం ఇతి అద్వైతం ఆడంబర అహంకార మమకారాది రెండవరూపం లేదు అని అద్వైత తత్త్వం. ఇంకెక్కడైనా ఏదైనా ఎవరైనా ఉన్నదా ఉన్నారా అని అద్వైతతత్త్వం అడగటం లేదు, పసక్తిచేయటంలేదు. ఎందుకంటె అవి తనను బంధించలేవు, భరించలేవు, ఉద్ధరించలేవు.

మతమును గురించిన తర్కం విడిచి, భగవద్గీత రెండవఅధ్యాయంలోని స్థితప్రజ్ఞుల క్షణాలనూ, పంద్రెండవ అధ్యాయంలోని భక్తుని లక్షణాలనూ, పదమూడవ అధ్యాయంలోని జ్ఞానలక్షణాలనూ, పదునాల్గవ అధ్యాయంలోని గుణాతీతుని లక్షణాలనూ సాధించి తనవిగ చేసుకుంటె, ఆ తరువాత రావలసిన సౌభాగ్యం రానేవస్తుంది. —శ్రీ స్వామి

## జీవిత సభ్యులు



**P. Srinivasa Rao**
17 - 62 / 1; Srinagar Colony,
Dilsuk Nagar,
Hyderabad - 60

# కార్యకర్త = గుండెకాయ

శరీరానికి విశ్రాంతి అవసరం - ప్రతి అవయవం విశ్రాంతి తీసుకుంటుంది నిద్రలో సహితం. కాని హృదయం (గుండె) ఎల్లప్పుడు పనిచేస్తూ ఉంటుంది. ఆగదు ఆగితే ...........అలాగే సమాజసంఘటనకై కార్యకర్తలు నిరంతరం పనిచేయడం (గుండెలాగ) అవసరం.

- బాబూరావ్ దేశాయ్

---

## అతని ప్రశ్న ?

ఎవరో ఎప్పుడో రామమందిరం ధ్వంసం చేసి తెలివిహీనుడు ఏదో కట్టడం నిర్మించి బాబరీ కట్టడం (మసీదు) అంటే తిరిగి మనం బుద్ధిమంతులం ఆకట్టడాన్ని తొలగించి రామమందిరం మరలా కట్టాలనడం సబబా?

జ : తొలగించడం తిరిగి నిర్మించడం అనేది ప్రశ్నకాదు - విషయాన్ననుసరించిన పెద్దసమస్య.

*ఉదా:-* భారత స్వాతంత్ర్యాన్ని విదేశీయులు హరించి మనలను బానిసలుగా చేసి పాలించారు - ఆ స్వాతంత్ర్యాన్ని మరలా తిరిగి పొందడానికి అనేక ప్రయత్నాలలో ఎందరో హతులవడం వీరోచితంగదా-

*అలాగే :* గజినీ ధ్వంసం చేసిన సోమనాధను మసీదుగా మార్చగా తిరిగి సర్దార్ వల్లభాయిపటేలు ఆమసీదును తొలగించి సోమనాధమందిరపు నర్ నిర్మాణం స్వాభిమాన పూరిత దేశభక్తి యుతం కదా.

అలాగే : తన తల్లికి అవమానం జరిగితే తనయుడు ఎంత బలహీనుడైనా ప్రతీకారం తీర్చుకోకుండా ఉండడుగదా-

*అలాగే :* జాతీయ జండాకు అవమానం జరిగితే జాతి సహించదు. ఇజ్రాయెల్ యూదులు అరబ్బీలచే ఆక్రమింపబడ్డప్పుడు అరబ్బీ భాషను అమలు పరచారు. యూదులు స్వాతంత్ర్యానంతరం తమదైన 'యూదు' భాషను పునరుద్ధరించు కొనివాడుకున్నారు.

అలాగే మనం దేశం, దేవాలయం, భాష, జాతీయజండా మాత, గోమాత మొదలైన మానబిందువుల విషయాలలో జాతి గౌరవ ప్రతిరూపాలుగా భావించి ఎంతటి త్యాగమైనా చేసి రక్షించుకోవాలి - లేనిచో మనిషి కేవలం అన్నంతినే పశువు మాత్రమే. ' ఉన్నది పుష్టిమానవులకు

(మరి ప్రభుత్వము ఆ ఉద్యమాన్ని ఎందుకు అణచివేయడానికి ప్రయత్నిస్తున్నది? - సమాధానం వచ్చేమాసపత్రికలో)

- పై. రాఘవులు

# హిందూ ఈజిప్ట్ (పూర్వం)

(గతసంచికతరువాయి) -రాజన్

1. ఇపుడు ఈజిప్ట్ అనేదిగతంలో ఐగుప్త (పంచగుప్తుల రాజ్యం)గా పిలువబడేది. బైబిల్‌లో చూపబడిన మిడిల్ ఈస్ట్ పటంలో క్రీస్తుకాలంలో ఈజిప్ట్ - ఐగుప్తగా గుర్తించబడి ఉండేది.

2. పురాతన ఈజిప్షియన్‌లు కాప్ట్స్ (గుప్త)గాను, వారిభాష కాప్టిక్ (గుప్తి)గాను తెలియజేయబడ్డది.

3. గొప్ప గొప్ప పిరమిడ్లు నిర్మించిన 'ఫరోహ్స్' చక్రవర్తలంతా హిందువులే. ఉదా:- అశ్వనాధన్ (అఖ్నాటన్), రమేష (రమేసిస్)లు హిందువులు.

4. గ్రీక్‌లకు "US' లేక "IS' గౌరవసూచకంగా వారిపేర్లకు కలుపబడేవి. ఆ "US' లేక "IS' లు తీసివేసిన హిందూపేర్లుగా తెలియును.

ఉదా:- అగస్త్య = అగస్టస్, (శూ)షూవి = జూలియస్.

5. గ్రీకుచరిత్రకారుడు 'ఫొటియస్' వ్రాసిన 'దిలైఫ్ ఆఫ్ ఐసిడోర్'లో బ్రాహ్మణులు అలెగ్జాండ్రియాలో నివసిస్తున్నట్లున్నది.

6. అల్గ్జాండరు ఈజిప్ట్‌ను జయించిన పిదప ఆయన పేరుతో 'అల్గ్జాండ్రియా' అని పట్టణానికి పేరు పెట్టబడింది. అలెగ్జాండర్ దండయాత్రకు పూర్వం ఆ పట్టణం పేరేమిటో (తప్పక హిందూనామంగా ఉంటుంది) పరిశోధకులు కనుగొనాలి.

7. పురాతన చరిత్రకారుల ప్రకారం బౌద్ధులు (తెరపిట, థెరపుత్రులు) అలెగ్జాండ్రి యాలో నివసించిరి.

8. ప్రపంచ ప్రఖ్యాతమైన అలెగ్జాండ్రియాలోని సంస్కృత గ్రంధాలయంను దురాక్రమణ దారులు భస్మంచేశారు. ఆమంటల్లో మానవచరిత్రే 6 నెలలపాటు తగలబడిపోయింది.

9. ఈజిప్ట్‌లో ప్రవహించే నైల్ (Nile) ఇపుడు - Nail - ఏమైనా అచటి స్థానికులు 'నీల్ (Neel) గా ఉచ్చరిస్తున్నారు. అది సంస్కృత పదం 'నీలం' అర్థాన్ని కలిగి ఉన్నది. నైల్‌నది నీరు మిక్కిలి నీలవర్ణంగా ఉన్నందుననే యూరోపియన్లు తెలియకుండగనే 'బ్లూనైల్' (బ్లూనది) అనేవారు.

---

జీవిత సభ్యులు

**M. GANGAIAH** (D.E.E.)

1-57; Prabhath Nagar, Chaitanyapuri,

Dilsuk Nagar, Hyderabad - 60



# శ్రీ రుద్రమ్

- Dr. M.V.R. శర్మ

యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే
శివాం గిరిత్రతాం కురు మాహిగ్ం సాః పురుషం జగత్॥

హే శివా! మంగళ కరా! నీ చేతి లోని ఆయుధ సంపత్తి సర్వలోకాలనూ సంహరించు సామర్థ్యము కలది. అయితే, ఆయుధాలతో లోక కంటకులైన దుష్టులను మాత్రము దండించుము. ఇతర మనుష్యులను మాత్రమే గాక, మిగతా ప్రాణి జాలాన్నంతా కూడా కాపాడుము.

ఆయుధాలతో దుష్టశిక్షణ జరుగుట ఎంత ముఖ్యమో, అమాయకులు బాధింపబడకుండుట అంత కన్నను ఎక్కువ ప్రముఖమైనది ఇదియే అనిష్ట పరిహారము.

శివేన వచసా త్వాగిరిశాచ్ఛావదా మసి
యధానస్సర్వ మిజ్జశద యక్ష్మగ్ం సుమనా అసత్.

''వేదాలు ప్రతిపాదించే భగవంతుడా! నిర్మలుడవైన పరమేశ్వరా మా సంతానాన్నీ, మా పశువులు మొదలైన జీవులన్నిటినీ రోగాలు లేకుండా కాపాడు మని భావము.

అధ్యవోచ వధివక్తా ప్రధమో దైవ్యో భిషక్
అహీగ్శ్చ సర్వాజ్ఞ భ్యయన్సర్వాశ్చ యాతుధాన్యః

మన బాధలకు కొన్ని ప్రత్యక్షకారణాలు (పాములు, తేళ్లుమొ॥), మఱికొన్ని పరోక్ష కారణాలు (ఎండ, గాలి, వాన మొ॥ వాటి అసంతులనం). పై కారణాల వల్ల ఏర్పడే వ్యాధులే రోగములు, దరిద్రము మొదలైనవి. చికిత్సకూడా – అనగా డాక్టరు – అయిన ఈశ్వరుడు ఈ వ్యాధులను నశింప చేయుగాక.

అసౌయస్తామ్రో అరుణ రుత ఎభ్రాస్సుమంగలః
యే చేమాగ్ం రుద్రా అభితో ధిక్షుశ్రితా
స్సహస్రశో వైషాగ్ం హేడ ఈమహే

రుద్రుడు సూర్యుని రూపముతో ప్రత్యక్షంగా ప్రకాశిస్తున్నాడు. ఈ సూర్యుడే కాక ఇంకను వేలాది సూర్యుల రూపమున జగత్తున కంతటికీ మంగళాన్ని ప్రసాదిస్తున్నాడు.స

ఆధునిక విజ్ఞాన శాస్త్రము ప్రకారము కూడ 10 X 10 13 సంఖ్యగల ఖగోళముల, అందు ఒక్కొక్క ఖగోళములో 10 X 10 21 సూర్యమండలములు వున్నట్లు అంచనా వేయబడినది. ఈ సూర్యులందరునూ జగదాధార భూతములు, జగన్మంగళ కారకులును. ఇలా అన్ని దిశలలో వర్తించు రుద్రమూర్తులైన సూర్యులు ప్రాణులు చేసుకునే కర్మలకు అనుగుణంగా వారిని నిగ్రహించుట మో లేదా అను గ్రహించుటమో చేయుదురు. వారికి నమస్కారము.

సూర్యోదయ సమయంలో క్రమ క్రమంగా కనబడే రంగుల మార్పును వేదం అభివర్ణిస్తున్నది. తామ్రః అంటే అతి ఎఱ్ఱని వాడు. అరుణః అనగా తదుపరి కొంచెం ఎఱ్ఱని వాడుగను, బభ్రు

అంటే గోరోజన వర్ణంలో కనుపట్టు వాడు గానూ వర్ణన.

అసౌ యో వసద్పతి నీలగ్రీవో నిలోహితః
ఉతైనం గోపా అదృశన్నదృశన్నుద హార్యః
ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః

భగవంతుడు ఈ సూర్య రూపంలో పండితులు, పామరులు - సమస్తప్రాణులకూ కూడా దర్శనం యిస్తున్నాడు. ఈ ఆదిత్యాత్మకుడైన రుద్రుడు మనలను సుఖింప జేయుగాక!

నమో అస్తు నీలశ్రావాయ సహస్రాక్షాయ మీడుషే
అధోమే అస్యసత్వా నోహం తేభ్యో కరం నమః

సమాజంలోని సకల ప్రాణులు రూపంలో మనం పరమేశ్వరుని దర్శించగలుగుతున్నాము. ఈ ప్రాణులన్నిటి కళ్ళూ కలగలిపి లెక్కించినచో ఆ సంఖ్య అనంత మగును. అట్టి అనంత సంఖ్యాకమైన కన్నులు గల, బహు ప్రాణిరూపమైన ఈశ్వరునకు నమస్కారము నీలగ్రీవునకు అనగా నల్లని కంఠముగల వానికి నమస్కారము. శివుడు జగత్తుకు మృత్యు కారకమైన హాలాహలాన్ని మ్రింగి నీలకంఠుడైనాడు. అందరి బాధలనూ తమవిగానే భావించి, వారందరి కష్టాలో తామే ధైర్యంగా ఎదుర్కొని, విశ్వాన్నంతా సుఖంగా వుంచాలనే తపనతో వుండే జగత్కల్యాణ కారకులై, ఆ రుద్రాంశతో వున్న వారెందరో RSS స్వయంసేవకులు మహోను భావులు. వారికి ప్రణామాలు. విశ్వకల్యాణమునకు కొద్దిమంది అయినా సుఖత్యాగాన్ని చేసి, కష్టసహిష్ణుతను పెంచుకోవలసిన విషయము అందరూ ఒప్పుకొని తీరవలసిందే కదా?

ప్రముంచధన్వనస్త్వము భమోరార్త్ని యోర్జ్యామ్
యాశ్చతే హస్త ఇషవః పరాత్ భగవోవప

భగవంతుడా! నీ ధనుస్సు యొక్క రెండు అగ్రముల నుండీ అల్లె త్రాటిని ఊడదీసి, నీ బాణములను పరాఙ్ముఖములు గావింపుము.

శివధనుస్సు స్థిర ధనుస్సు. '' ఇమారుద్రాయ స్థిరధన్వనే గిరః'' అని శ్రుతి. ధనుస్సును కదిలించుట అసాధ్యమైనను, అల్లెత్రాటిని తొలగించుట భగవంతునకు సాధ్యమే. భగవంతుడు షడ్గుణ సంపన్నుడు.

ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్య మోశ్చైవ షణాం భగ ఇతారణా

ఈ ఆరుగుణముల కలిగిన ఈశ్వరుడు ఆ అల్లెత్రాటిని తొలగింపను సమర్థుడు.

అవతత్య ధనుస్త్వగ్ం సహస్రా క్షశతేషుధే
నిశీర్య శల్యానాం ముఖా శివో నస్సుమనా భవ

నీ బాణాగ్రమును అధోముఖాలు గావించి సౌమ్యస్వరూపుడవు మరియు అనుగ్రహ బుద్ధిగల వాడవు కమ్ము.

# భారత్ పై ఇండియన్ల దాడి

ఈ దేశంలో రెండు వర్గాలు. ఒక వర్గం భారతీయులు రెండవది ఇండియన్లు. భారతీయులు అధిక సంఖ్యాకులు కాగా ఇండియన్లు అతి స్వల్పమైనారిటీలు ( అల్ప సంఖ్యాకులు) కేవలం 10 శాతం) బ్రిటీషు వారి వారసత్వం వల్లనూ నెహ్రూ కుటుంబము యొక్క పాశ్చాత్య పోకడల వల్లనూ స్వాతంత్రము వచ్చినప్పటికి కూడ భారతీయులను ఇండియన్లు పాలించుతునే వున్నారు. ఈ సమస్యకు మూల కారణము గాంధీజి, సర్దారు పటేల్. మరియు లాల్ బహుదూర్ శాస్త్రి గార్లకు యీ క్రొత్త దేశాన్ని తీర్చి దిద్దేందుకు అవకాశము లేక పోవుటే.

నేడు సినమాల్లోను, టి.వి. ల్లోనూ వస్త్రధారణ, తినడం, త్రాగడం, పండుగలు, పుట్టిన రోజులు. శుభాకాంక్షలు, అతిధుల పలకరింపులు, యితరదిన చర్యల్లోనూ అమెరికా – ఇంగ్లం డులను అనుకరించుతున్నాయి. భారతీయ విలువలను, ప్రొత్సహించువారిని నిర్దాక్షిణ్యముగా నిరసించడమే గాక, వారిని పాతకాలపు వారని, చాంధసులు, మరియు వెనుక బడిన వారిగా ముద్ర వేసారు.

ఇటీవల భారత్‌పై రెండు ప్రొగ్రాంలు బలవంతంగా విధించ బడినవి. ముంబాయినగరం మైకల్ జాక్సన్ సంగీతం శివసేన ఆదర్శానికి కలుషితం చేసింది. మనము బీదవారము కావచ్చుగాని ఏనాటికి, ఎప్పటికి ముష్టివాళ్లము కాము, ధనము సంపాదించడానికి ఒక్క మైకల్ జాక్సన్ దొరికాడా?

భారతీయనృత్యము, సంగీతము, కళలు, శిల్పములు ప్రదర్శింప వచ్చుననే తలంపు వారికి ఎందుకు కలుగలేదో? మైకల్ జాక్సన్ స్వాగత సన్నాహాలకు ప్రత్యేక వాహనములో టన్నుల సామగ్రిని తీసుకొని రావడం. దీని కొఱకు, విపరీతవ్యయము, రాద్ధాంతము, కన్నులు మిరుమిట్లు గొలిపే లైట్లు. చెవులు దద్దరిల్లే ధ్వని. కోట్ల ఖర్చు వృదా. నిర్వాహకులకు అవమానము, శివాజీ మహారాజ్ గారికి కళంకము అపకీర్తి.

విపరీత వ్యయముతో అమితాబ్ బచ్చన్ బెంగుళూరులో నిర్వహించిన ప్రపంచ సుందరీ మణులపోటీ రెండవది. దేదీప్య మానమైన లైట్లకాంతులలో యవ్వన సుందరాంగులు తమను ప్రదర్శించు కున్నారు. చూపరులకు కానవచ్చిన దేమిటి? పరస్త్రీలను కూడ కన్న తల్లితో సమానంగా చూచే భారతీయ సంస్కృతి మంట గలసింది. ఆకర్షణీయమైన అందగత్తెకు ఖరీదు కట్టివేలము పాట ప్రారంభమవుతుంది. ప్రకటన కర్తలు తమ సామగ్రిని విక్రయించడానికి ఆమెను వాడుకుంటారు. ప్రపంచం నలుమూలలా సైనికులకు వినోదము కలిగించడానికి త్రిప్పుతారు. ఆమెకు తగిన పరిహారము వేతనము చెల్లిస్తారు. ''అమ్మకానికి అందం'' "Beauty for sale".

ఈ దేశపు అధిక సంఖ్యాకులు పెట్టుబడి దారులు ప్రభావం వల్ల మౌనం వహింతురు. మనకు ఏ కొంచమైనా భారతీయ సంస్కృతి, నాగరీకతలపై గౌరవమర్యాదులున్న యిటువంటివి ప్రదర్శింప బడేవా? యీనేలలో.

ఆగ్రాలో తాజమహల్ వద్ద ''యన్ని'' సంగీత ప్రదర్శనకూడ జరిగింది.

పాశ్చాత్య దేశాలనుండి, పరిశ్రమలు, వంచన, మురికి, పరాన్న భుక్కుల నివాసము, నిర్లక్ష్యము, సైన్సు పుస్తకాలు, సినిమాలు, పోటీలు, ఒంటరి తనాన్ని దిగుమతి చేసుకుంటున్నాము వారి వద్దనుండి పౌరి శుధ్యము, పౌరసత్వము తోటి (యితరుల) వారి గురించి ఆలోచన, శ్రమ, శాస్త్రీయ దృక్పధము, చొరవ, నమ్రత, వినయం. నిష్కపటము చాల నేర్చుకోవలసియున్నది. సాధారణంగా వారు ఆశించిన ప్రశంసలు, పాటించము కాని సునాయాసంగా ఆశించ కూడని వాటిని తీసుకుంటాము. మన సుగుణములను కాపాడుకుంటూ వారిమంచివి అవలంబించ వచ్చు మనవి వారివి భ్రమలను తొలగించుకోవాలి. నమ్రత వినయము లేనప్పుడు వంద విధాలా సర్వనాశనము తప్ప మన ప్రజలకు లభించ గలిగేదేమున్నది. ఆలోచించి మేల్కొను సమయమా సన్నమైనది. ఉత్తిష్టత - జాగరూకత.

సేకరణ "ప్రభా"

### విశ్వహిందు పరిషత్‌చే

## వాస్కోడిగామా ఉత్సవాల ఖండన

న్యూడిల్లీ / 500 సం॥ క్రితం భారతదేశం వచ్చిన ఒక పోర్చుగీసు ఓడదొంగ; ఒక క్రైస్తవ మత ప్రచారకుడు ఆయిన వాస్కోడిగామా రాకను పురస్కరించుకొని, భారత ప్రభుత్వం మరియు రాష్ట్ర ప్రభుత్వం ఉత్సవాలను నిర్వహింప తలపెట్టడాన్ని దేశభక్తులైన ప్రజలందరికి ఒక అఘాతం కలిగించే వార్త.

విహెచ్‌పి జాయింట్ సెక్రటరి శ్రీ ఓమ్‌కార్ భావె ప్రభుత్వ చర్యను నిందిస్తూ, చారిత్రాత్మక సత్యాలను మసిపూసి మారేడు కాయ చేయ్యడం వంటిది. అని విమర్శించారు వాస్కోడిగామా ఒక దోపిడిదారు దేశాన్ని కొల్లగొట్టడానికి వచ్చిన రాజు. అతనిని ఇతర దోపిడీదారులైన ఘోరీ గజనీ, మరియు బాబరుల వరుసలో లెక్కించవచ్చు అంతే: (మీ. ఫో)

---

## హనుమాన్ చాలిసా ఉత్సవాలు - ట్రినిడాడ్ మరియు సురినామ్ లలో

ట్రినిడాడ్, సురినామ్ మరియు ఇతర కారిబియన్ దేశాలలో వున్న ప్రతిహిందువుకు ఈ సంవత్సరము ఒక "హనుమాన్ చాలీసా" పుస్తకమును వ్యక్తిగత పేరుతో బహూకరిస్తారు. అది ప్రధాన భాష అయిన హిందీలో వుండి, రోమన్ భాష అనువాదమును కూడ కల్గివుండి ఇంగ్లీషు సారాంశముతో వుంటుంది.

శ్రీ తులసీ దాస్ 500 జన్మదిన ఉత్సవాన్ని పురస్కరించుకొని ఈకారి బియన్ వాసులు పైపుస్తకమును ముద్రించి తమవంతు ప్రగాఢ భక్తిని ప్రకటించుకొంటున్నారు.

(మీ.ఫో).

# దక్షిణ భారతంలో జాతీయతావాదులైన నాయకులు క్రమంగా క్షీణింపబడుతున్నారు

దక్షిణ రాష్ట్రలైన ఆంధ్ర, తమిళనాడు, కేరళ, కర్నాటకాలలో గత కొంతకాలంగా జరుగుతున్న కొన్ని సంఘటనలు దేశదృష్టిని ఆకర్షించలేదు. ఆంధ్రప్రదేశ్‌లో నక్సల్స్ ఘాతుక చర్యలు నిరాటంకంగా కొనసాగుతున్నయి.స్వాతంత్ర దినం రోజున ప్రభుత్వ భవానాలపై జండా ఎగుర వేయక పోవడం, ఉస్మానియా యూనివర్సిటీ విధ్యార్థి పరిషత్ నాయకుని బహిరంగహత్య, అనేక మంది బిజెపి. ఆర్. ఎస్ ఎస్ మరియు ఎబివిపి కార్యకర్తలపై ఘాతుక చర్యలు – ఇవి అన్ని రాష్ట్ర ప్రభుత్వం అరికట్టలేక పోతున్నది.

కర్నాటకలోని ఐయస్ ఐ. కార్యకలాపాలకు ఆర్ ఎస్ ఎస్ వారిని బాధ్యులు చేస్తున్నారు తప్ప మతకలహాలకు కారకులైన పాకిస్థానీ ఎజెంట్లను ఎవరూ పట్టించుకోవటము లేదు.16 సెప్టెంబర్ 1993 న నియమించ బడ్డ. జస్టిస్ కాదంబడి జగన్నాధ్ శెట్టి కమీషన్ ఉత్తర కర్నాటక భటీకాల్‌లో ఎప్రిల్ 1993న జరిగిన మతకల్లోలాలకు పూర్తిగా పాకిస్థాన్ ఏజెంట్లెనని నిర్ధారించింది. కర్నాటక తాలూకాలలో ప్రవేశించి మతకల్లోలాలకు కారణమౌతువున్న ఐయస్ ఐ కార్యకలాపాలు అరికట్టాల్సిన భాధ్యత కర్నాటక ప్రభుత్వానికి లేదా?

> ''గత కొన్ని సంవత్సరాలుగా, ఆర్ ఎస్ ఎస్ క్రియశీల కార్యకర్తలను, బిజెపి వారిని, ఎబివిపి వారిని మరియు హిందు మున్నని వారిని, జాతి విద్రోహ చర్యలు జరుపు వారు ఐయస్ఐ వారి అండదండలతో, ఒక పథకం ప్రకారం హతమారుస్తున్నారు.''

కేరళలో గత 12 సంవత్సరాలలో 126 మంది ఆర్ ఎస్ ఎస్. బిజెపి మరియు విద్యాపరిషత్ కార్యకర్తలను ఘాతుకంగా హత్యచేయడం జరిగినది. వీరికంతా సి ఐ టి యు మరియు సి పి ఎమ్ (కేరళ)తో సంబంధం వున్నది.

ముస్లిం మతోన్మాదులైన వారు 1990 నుండి. తమిళనాడులో 28 మంది కార్యకర్తలను వధించినారు. ఆర్ ఎస్ ఎస్ మరియు హిందూ మున్నని వారి కార్యాలయాలను ధ్వంసం చేసినారు. హిందుమున్నని రాష్ట్ర ప్రెసిడెంటు హత్య జరిగినా నేటి వరకు ఎవరిని పట్టుకోవడం, కోర్టుకు హాజరు పర్చడం కూడ జరుగలేదు. 1980 లో డి ఎంకె ప్రభుత్వం దిండిగల్ జిల్లా పేరును క్వాది మిల్లెట్‌గా మార్చాలని ప్రయత్నించడాన్ని ఆర్ ఎస్ ఎస్. బిజెపి, మరియు విహెచ్‌పి వారు వ్యతిరేకించినప్పటినుండి ఈ హత్యాకాండ ప్రారంభమైనది. దేశ విభజనకు ముస్లిం లీగు కారణమన్న విషయాన్ని వీరు ఆ సమయంలో గుర్తుచేశారు. మీనాక్షిపురంలోని హిందువులను మతం మార్పిడిని ముస్లింలు ప్రారంభించటాన్ని వీరు వ్యతిరేకించినారు. హిందుమున్నని వారు గణేష్ ఉత్సవాలను నిర్వహించడాన్ని మతోన్మాద మరియు ముస్లిం మత వ్యతిరేక చర్యగా చిత్రీకరింపబడ్డది.

వీటన్నిటి వెనుక ఐయస్ ఐ వారి హస్తమున్నదని తెలిసినా, కేరళలోని మల్లాపురంలో 70

పైపుబాంబ్స్ దొరికినా అవి అన్ని బిజెపి, ఆర్ ఎస్ ఎస్ కార్యకర్తలను హత్య చేయుటకొరకు చేకూర్చారని తెలిసినా, ఆర్‌డి ఎక్స్ బాంబులు తమిళనాడు ప్రవేశము గురించి రాజేష్ పైలట్ వ్యాఖ్యానించినా ముస్లిం మత వాదులు కారకులు అని ఋజువు అయినా వారిపై చర్య తీసుకోలేదు.

ఇట్టి ఘాతుకమైన దేశద్రోహ చర్యలకు విరుద్దంగా రాష్ట్ర ప్రభుత్వాలు ఏమిస్పందిచాయి? అట్టిచో సాధారణ పౌరుని పరిస్థితి ఏమీ, సమాజవ్యతిరే కశక్తులను అణచి వేయక పోతే రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం విఫలమైనట్టే కదా? మరి ఇంకా ఎందరు బలికానున్నారో. దక్షిణ ప్రాంతంలో జరిగే ఈ విద్రోహ చర్యలను అరికట్టక పోతే ఆందోళన జరుగక పోతే, ప్రజలు స్పందించక పోతే భవితవ్యం ఏమిటి ?

సేకరణ :
– ప్రమోద్ వళసంగకర్

---

**తాలిబాన్‌చే 'పెద్ద బుద్ధ' శిల్పాన్ని కూల్చివేసే చర్యను విహెచ్‌పి తీవ్రంగా ఖండిస్తున్నది.**

న్యూఢిల్లి : బైమిన్ ప్రావిన్స్ ఆఫ్గానిస్తాన్‌లోని 'పెద్దబుద్ద' విగ్రహాన్ని ఇస్లామిక్ తాలిబాన్ ప్రభుత్వము నాశనము చేయతలపెట్టిన ఘాతుక చర్యను విహెచ్‌పి తీవ్రంగా నిరసిస్తున్నది.

ఇస్లామిక్ చర్యగా పేర్కొన బడుతున్న ఈరాక్షస తాలిబాన్ విధానాన్ని, శ్రీ ఓంకార్ భావే తీవ్రంగా దుయ్యబట్టూ తన ఆందోళనను వ్యక్తం చేసినారు.

55 మీటర్ల ఎత్తు కలిగి వున్న ఈ చక్కని బుద్ద విగ్రహం పురాతనమైన ''సిల్కురోడ్'' లో పెద్ద బజారు కూడలిలో వున్నది. దీన్ని కనిష్కరాజు నిర్మంచినాడు. దర్శనార్థమై శతాబ్దాలుగా ప్రపంచం నలుమూలలనుండి యాత్రికులు వచ్చి వెళ్లేవారు. ఈ విధానము ఈ దేశాన్ని ఇస్లాం మతస్తులు ఆక్రమించుకునే వరకు నిరాటంకంగా కొనసాగింది.

ఈ విగ్రహమే కాక ఇక్కడ ఇతర శిల్పాలు రమ్యంగా చెక్కబడి, చరిత్ర కారులకు కావలసినంత అమూల్య చారిత్రక సమాచారాన్ని అందించే విశేషాలు కూడ వున్నవి.

బాబ్రీమసీదు కూలిపోయినప్పుడు మొసలి కన్నీరు కార్చిన సెక్యూలర్ సిద్ధాంతీకులు ఎవరూ ఇప్పుడు పెదవి విప్పడం లేదు. శ్రీభావే వారితో ఇస్లామిక్ దుశ్చర్యను తీవ్రంగా ఖండించమని కోరినారు.

ఇస్లామిక్ స్వాతంత్ర్యము అంటే, ఇతర మతస్థుల భావ, నమ్మకాల ధ్వంసమే అని అర్థం స్ఫురిస్తే ప్రపంచంలోని ఇతర మతస్తులెంతో చాలా జాగ్రత్తలో వ్యవహరించే అవసరము, సమయము అసన్నమైనదని అర్థము అని విహెచ్‌పి ప్రవక్త ఆందోళన వ్యక్తం చేసినారు.

(మీ.ఫో)

# దురాక్రమణదారులు మందిరాల స్థానంలో నిర్మించిన కట్టడాలు

## ఢిల్లీ

కువ్వతుల్ ఆలం మసీదు, 1198 క్రీ.శ. మెహరౌలీ (మిహిరవల్లి ముస్లిం పాలనలో మెహరౌలీ అయింది.),; కుతుబ్‌మినార్, మెహరౌలీ, షంషేద్దీన్ ఇల్‌తుత్‌మిష్ మక్బరా, 1235 క్రీ.శ., మెహరౌలీ,; షేక్ కుతుబుద్దీన్ బక్తియార్‌కాక్ దర్గా, క్రీ.శ. 1236, మెహరౌలీ,; జహాజ్‌మహల్, మెహరౌలీ,; అలాయీ దర్వాజా, మెహరౌలీ,; అలాయీ మీనార్, మెహరౌలీ,; అల్లావుద్దీన్ ఖిల్జీ మక్బరా, మద్రస్సా, మెహరౌలీ,; గియాసుద్దీన్ బాల్బన్ మక్బరా, మెహరౌలీ,; షేక్ ఫజులుల్లా మజార్ (సమాధి), జమాలీ కమాలీ మసీదు,; మాఢీ మసీదు, మెహరౌలీ.; సుల్తాన్ షంషుద్దీన్ ఇల్‌తుత్‌మిష్ కొడుకు నసీరుద్దీన్ మక్బరా, క్రీ.శ. 1231 సుల్తాన్‌గఢీ,; బాబరీ మసీదు, క్రీ.శ. 1528 పాలమ్,; బేగంపూర్ మసీదు,; కాలూసరాయ్ మసీదు, బేగంపూర్,; షేక్ నజీబుద్దీన్ ముత్వక్కల్ చిష్తీ మజారు, క్రీ.వ. 1272, బేగంపూర్,; గియాసుద్దీన్ తుగ్లక్ మక్బరా, తుగ్లకాబాద్.; షేక్ నసీరుద్దీన్ చిరాగ్ – ఇ – దేహులీ దర్గా, క్రీ.శ. 1356.; బహలోల్‌లోడీ మక్బరా,; షేక్ నిజాముద్దీన్ చిష్తీదర్గా, జమాత్ ఖానా, క్రీ.శ. 1325 నిజాముద్దీన్,; కిలామసీద్,; చౌసట్‌ఖంబా (64 స్తంభాల గుడిని మసీదుగా మార్చటం జరిగింది), నిజాముద్దీన్,; ఖాన్ – ఇ – జహాన్ తిలాంగనీ మక్బరా, నిజాముద్దీన్,; నిజాముద్దీన్ ఔలియా చిల్లా, నిజాముద్దీన్,; లాల్‌మహల్, నిజాముద్దీన్,; ఫిరోజ్‌షా తుగ్లక్ మక్బరా, మద్రసా, హౌజ్‌ఖాస్,; దాదీ పోతీకా మక్బరా, హౌజ్‌ఖాస్,; బిరస్ కా గుంబద్, హౌజ్‌ఖాస్,; ఛోటీ ఔర్ సంకరీగుమ్బద్, హౌజ్‌ఖాస్,; నీలీ మసీదు క్రీ.శ. 1550 – 6 హౌజ్‌ఖాస్,; ఈద్గా క్రీ.శ. 1404, హౌజ్‌ఖాస్,; భాగ్ – ఇ – ఆలంకా గుంబద్, క్రీ.శ. 1501, హౌజ్‌ఖాస్,; నసీరుద్దీన్ ముబారక్ గజనీకా మక్బరా, క్రీ.శ. 1234–35, హౌజ్‌ఖాస్,; షేక్‌కబీరుద్దీన్ ఔలియా మఖార్ (దీనినే లాల్‌గుంబద్ అని కూడా అంటారు) క్రీ.శ. 1397, మాలవీయనగర్.,; షేక్ అల్లావుద్దీన్ మజార్, క్రీ.శ. 1507, మాలవీయనగర్,; షేఖ్ యూసుఫ్ కత్తాల్ మజార్, క్రీ.శ. 1527, మాలవీయ నగర్.; మహ్మద్‌షా మక్బరా, లోడీగార్డెన్స్,; బడా గుంబద్ మసీదు, క్రీ.శ. 1494, లోడీ గార్డెన్సు.,; శీశ్‌గుంబద్, లోడీ గార్డెన్సు.,; సికందర్‌లోడీ మక్బరా, లోడీ గార్డెన్సు.,; షేర్షాగేట్, పురానా ఖిల్లా.,; కలాకీ కుహనా మసీద్ పురానా ఖిల్లా.,; ఖైరుల్ మంజిల్ మసీదు, పురానా ఖిల్లా.,; కాలీ మసీదు, తుర్క్‌మాన్‌గేట్.,; రజియాసుల్తానా మక్బరా, షాజహానాబాద్,; జామి మసీదు, భోజల్‌పహాడ్,; జైనతుల్ మసీదు (ఘటామసీదు), షాజహానాబాద్,; షాతుర్క్ మాన్ దర్గా, షాజహానాబాద్,; షా ఆలం మజార్, మసీదు, వజీరాబాద్,; కాలేఖాన్ కీ .ుంబద్, భూరేఖాన్‌కే గుంబద్, ఛోటే ఖాన్ కీ గుంబద్, బడేఖాన్ కీ గుంబద్, సౌత్ ఎక్స్‌టెన్షన్.,; ముబారక్‌షా మక్బరా, కోట్లాముబారక్ పూర్.; కుష్క్‌మహల్, తీన్‌మూర్తి,; సుందర్ బుర్జ్, సుందర్‌నగర్.,; జామి మసీద్, ఫిరోజ్‌షా కోట్లా.,; అబ్దున్నబీ మసీద్, తిలక్‌బ్రిడ్జి,; రోషనారా బేగం మక్బరా,; మాల్చామహల్.,; బూలీ మతియారా మహల్,; కదమ్ శరీర్,; చౌబుర్జా మసీదు,; పీర్‌గాయబ్.,

ఆంధ్ర వీరులు

# ఆంధ్రకేసరి

(గత సంచిక తరువాయి - 8)

– రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

అప్పుడు చెన్నపట్టణము నందలి పత్రికలన్నిఁ జూడగాన్
గొప్పగనాంగిలేయులను గూర్చి పొగడ్లఁ జిమ్ముచున్నదో
చొప్పున రాజకీయముల జోరునఁ జొక్కుచు సాగుచుండగా
నొప్పని టంగుటూరి యొక యుత్తమ పత్రికనడ్ప బూనెడున్

శ్రీ ముట్నూరియు, కాశినాథునియు, నాశ్రీమాన్ ప్రకాశంబుకున్
తామెంతేనియుఁబ్రేరణంబగుచుఁ జేతైనంత సాయంబిడన్
శ్రీమాన్ రాజజీశే ముషీత్వము దియున్ చేదోడు వాదోడుగాన్
నామంబొక్కటి నిర్ణయించుకొనెనా నందంబు యేపాఱగన్

పత్రిక నిర్వహించుటకు వల్సినడబ్బది లక్షలాదిగన్
మిత్రుల మాట సాయమున మిక్కిలి నేర్పుగఁ గొంతమేఱకున్
పత్రము సాక్ష్యముల్ మొదలు పద్ధతులందునఁ గొంతమేఱకున్
చిత్రముగా గఁజేకుఱెను, చెప్పగనేటికి సొంతపైకమున్

అదియ స్వరాజ్య పత్రిక, మహాత్ముని, కాంగ్రెసు యాశయంబులన్
పదిలముగాగ దేశమునఁబాదుకొనంగను జేయుపూన్కితోన్
పదియును తొమ్మిదిన్నవలి భాగమునందున నిర్వదొక్కటన్
పదపడి యక్టొబర్ చివర ప్రప్రథమంబుగ వెల్గఁజూచెడున్

అరవమునందు నాంగ్లమున నాంధ్రమునందిటు మూడు భాషలన్
ఉరవడి పర్వడిన్నుఱుకు లెత్తుచు మిక్కిలి సుందరంబుగన్
సరసపు మూల్యముంచుచును చక్కగఁ బత్రిక వేయుచుండగాన్
గరము గరంబుగన్ ప్రతులు కమ్మగఁ జెల్లుచునుండె రోజునున్

మదరాస్ రాష్ట్రము నందెగాదు; మీఱియీయామాగాణ మందంతటన్
మదికింపై జను పత్రికంచు జన సామాన్యంబు భావించుచున్
ఉదయంబందునె పత్రికార్థమయి యత్యుత్సాహమున్ జూపుచున్
ఎదురుండెన్నుఱు చూచుచుండిరనగానే మంత యాశ్చర్యమా!

మోతీలాలుడు పత్రికల్ జదివితామోహాత్ముడై యొప్పుచున్
ఖాతాదారుని వోలె మాఱుచును పైకంబంపె చందాయనన్
ఆతాలుకగు పైసలవ్వి పదివేలద్దానికన్ దానునా
మోతీలాలుకు పత్రికందున దగన్ మోతాదు వాటానిడెన్

అలరాజాజియు, శ్రీ ప్రకాశమును, తామాహ్లాదముప్పొంగగాన్
అలకర్ణావతి కాంగిరేసుసభలో నాగాంధి జీ సన్నిధిన్
కలిసింగూర్చొని పత్రికన్ గుఱిచి సాకల్యంబుగాఁ దెల్పగన్
కలగానెంచుచు సంతసించె భళి! యాగాంధీజితానెంతయున్

ఈగతిఁ బత్రికన్నతడు యిబ్బడిముబ్బడి వేడిపొంగులన్
దోగుచు, నేర్పుమీఱగను దొడ్డ మనంబున నడ్పుచుండగాన్
బాగును నోగునున్ గనని బాబులు కొందఱు యేమిచెప్పిరో!
యేగతిఁ జేసిరో! తెలియ దేఱికి! వచ్చెనుకష్టమత్తఱిన్!

పరగన్ గాంధిజి యొక్క నాడుడివె ‘‘నావార్తా మహా పత్రికన్
మరుమాటాడక నిల్పివేయుమని’’. యామాన్యాత్మునాయాజ్ఞచే
బరువెక్కెన్ యెదటంగుటూరికిక సాబాలయ్యె దేహంబునున్
అరికాల్ మంటది నెత్తికెక్కినటు తానారాటమున్ జెందె పో!

అతడు ప్రసిద్ధి కెక్కిన మహామహితాత్మకుడౌను గాక, తా
నతనికిలోబడన్ వలసినట్టి యొకానొక డౌనుగావుతన్
సతతమహాప్రయత్నమున సాగుచు వచ్చిన యజ్ఞమైన, యీ
జతనము నాపుఁజేయుమని చెప్పగ నొప్పునె యేరికేనియున్

స్వార్థంబున్ తను కోరిగాదు; మఱియా సాబర్మతీమౌనికా
ర్యార్థంబై తను చేయునట్టి కృషియౌ, యాథార్థ్య మెంచంగదే
శార్థంబైచను కార్య మిద్ది, మఱితా శాసింప నేలంచు తా
ప్రార్థించెన్ తగగాంధిజీని బహుధా ప్రాధేయ పూర్వంబుగాన్

మునుగాంధీజియు దక్షిణాఫ్రికలో మోముధ్యంబుగాన ద్ప్రచున్
ఘనమైయొప్పిన వారపత్రికను, మోకాలొడ్డి మాన్పించు నా
కనికారం బిసుమంత లేని ప్రభుతన్ గర్దించడో తాను, నా
గుణపాఠంబిపుడేడ బోయే? ననుచున్ గూటించెఁదాగాంధినిన్

ప్రజల మహోను భావమున వర్ధిలివర్తిలుచున్న పత్రికన్
ఋజువగుకారణంబు వివరింప కనిట్టుల నాపివేయుచోన్
ప్రజలు యపోహలంబడి యభాండము వేయుట నిక్కమంచు, గాం
ధిజికి వచించెఁదానుగ సుదీర్ఘముతొ తమ చర్చలందునన్

''తానునిమిత్త మాత్రుడు, యధార్థమునారయ మందియే ప్రభుల్
మానుగ వారి ప్రాపునను మాడలు మూడగు లక్షలేర్పడెన్
దానిని మూల కోశముగ దాచితి మంచిగ పత్రికార్థమై
కాన మహాత్మ! నావలనగాదు ''స్వరాజ్య''ను నాపుఁ జేయగన్''

పందొందొందల యిర్వదిన్ మఱియు నాపైరెండు వర్షంబులన్
గాంధీజీ తొలిసారిగానుడువగన్ కాదంచుఁదా బల్కగన్
కందెన్ గాంధిజి, యంతఁ బోక కదపంగాఁ బూనె రెండేండ్లకున్
పందెంబొడ్డిన మాద్రిమాఱి, యదియున్ బాహాటమయ్యేన్భువిన్

మొత్తము మీద పత్రికకు ముప్పది వాటిలె నాటినుండియున్
వత్తిడి యెక్కువౌకతన వందురుచున్న ప్రకాశమంతటన్
సత్తువఁగూడ దీసికొని సాగుచునుండెను సొంతబాటలో
నత్తఱి కోర్టుకేసులవి యద్దము వచ్చె మఱింతఁ బీడగన్

మోహన్ దాసుడు, టంగుటూరియు, మహామోమోట మడ్డంబు రాన్
బాహాటంబుగ మాటలాడు కొనునాభాగ్యంబుకుందప్పుచున్
ఊహింపంగనురాని చిక్కులనహో ఓరీతిఁగల్పింపఁగాన్
ఆహా! బుట్టెఁదదీయమార్గ చరులం దారాటమేపాఱగన్

పదియున్ దొమ్మిది వందలేండ్లవయి ముప్పై రెండు వర్షంబునన్
ఎదలో బాకును గుమ్మినట్లగుచుఁ దానేదేని లేకుండగన్
శిధిలంబయ్యె ''స్వరాజ్య'' సంపదది నిశ్శేషంబుగా తానహో!
అదియుంగాక, గతించె భార్యహను మాయమ్మంతదుఃఖంబునన్

అతడు జనించే పేదల గృహంబున యుందుననాణి ముత్యమై
సతతమహా ప్రయత్నఫల సాయమనంగను పొందె సంపదల్
అతడు త్యజించె వృత్తిని మహాధన రాసుల దేశ సేవకై
సతతదరిద్రుడై, సరిగ శర్వుని బోలిన సర్వుడోయనన్!

# విశ్వప్రేమ

– పి.వి. రమణారెడ్డి

మిథో విఘ్నానా ఉపయన్తు మృత్యుమ్ అథ. 8–8–21

పరస్పరము వైరవిరోధములు చూపించుకొనువారు, కలహించువారు మృత్యుముఖమున బడుచున్నారు. వేదభక్తుడు అందరిప్రేమకు పాత్రుడు కావలెనని – భగవంతుని ప్రార్థించుచున్నాడు.

ప్రియం మాకృణు దేవేషు ప్రియం రాజను మాకృణు

ప్రియం సర్వస్య పశ్యత ఉత శూద్ర ఉతార్యే అథ. 19–62–1

ఓ దేవా! విద్వాంసుల ప్రేమకు పాత్రుడనుగా చేయుము రాజులకును ప్రియుడనగునట్లు ఆశీర్వదింపుము. నన్ను చూచునట్టి ఆర్యులకు అనార్యులకు, శూద్రులకును ప్రేమపాత్రుడనుగా చేయుము.

విక్టర్ హ్యూగో చెప్పినట్లు

Life is a Flower of which love is the honey "Victor Hugo"

జీవితము పుష్పముతో సమానము. ప్రేమ అందున్న మధువు. ఈ మధువును ప్రోగుచేయుమని వేదము మనకు ఉపదేశించుచున్నది. ఎంతటి పునీతమైన భావనయో చూడుము.

దృతే దృగ్‌ంహ మా మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షంతామ్
మిత్రస్యాహం చక్షుపా సర్వాణి భూతాని సమీక్షే
మిత్రస్య చక్షుషా సమీక్షామహే మజు. 36–18

సమస్త దుఃఖములను, అజ్ఞానమును, అంధకారమును నివారించు మహాప్రభూ! నన్ను దృఢవంతునిగా చేయుము. ప్రపంచమున గల సమస్త జీవులు నన్ను మిత్రునిగా చూచునట్లు దయచూపుడు. నేను సకల ప్రాణులను మిత్రులవలె చూచునట్లు అనుగ్రహింపుడు. మేమందరము – ఒకరిని మరొకరు మిత్రుల వలె చూచుకొందుముగాక. పరస్పరము ప్రేమ దృష్టితో చూచుకొనుచున్నందున గలుగు ఫలితమును గురించి వేదమిట్లు చెప్పుచున్నది.

యస్తుసర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి।
సర్వ భూతేషు చాత్మానం తతో నవిచికిత్సతి॥ యజు. 40–6

సర్వ ప్రాణుల సుఖదుఃఖములను, లాభనష్టములను తనకువలె చూచువాడు ప్ర–కృతి మో॥ సమస్త పదార్థములందు పరమేశ్వరుడు వ్యాపించి యున్నాడని తెలిసినవాడు సంశయములకు దూరముగా నుండును.

నదులందు, సరస్సులందుగల నీరు సర్వధాతువులకు, లవణాలకు, ఓషధివనస్పతులకు నిలయం. నీటిని ఆశ్రయించే సర్వప్రాణులు జీవిస్తున్నవి. జలములేనిది ప్రాణిసృష్టిలేదు. కనుక నీరే మొదట సృజింపబడినదని, ఇతర భూతసృష్టితరువాత జరిగినదని మన స్మృతిగ్రంథములు తెలుపుతున్నవి.

అప్సుమే సోమో అబ్రవీ దన్తర్విశ్వాని భేషజా

అగ్నించవిశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః॥

– ఋగ్వేదం. I.23–20

సర్వౌషధులును, ప్రపంచానికి మంగళకారకుడు అయిన అగ్నియు జలములందు కలవని మంత్రద్రష్టకు సోముడు చెప్పెను.

'' ఓ జలములారా! రోగనివారణకై నాదేహము, ఓషధులను నింపుడు, సూర్యుని చూచుటకై మేము ఎల్లవేళల రోగరహితులము అగుదుము గాక! (ఋ.I.23-21) అని ఋషులు జలములను ప్రార్థింపడం వలన రోగనివారణకై నీటిని, సూర్యరశ్మిని ఆశ్రయించడం ఎంత ప్రాచీనమో మనకు తెలుస్తున్నది.

''మృత్తికే దేహి మే పుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్''

' ఓ మృత్తికా! నీయందు ఓషధులు, వనస్పతులు, ధాతువులు మొదలైనవన్నీ నిలిచియున్నవి. కావున నీవు నాకు పుష్టిని ఒసగుము అంటూ మట్టితో స్నానం చేయవలెనని స్మృతివాక్యాలు తెలుపుతున్నవి.

అమృతముతో సమానమైన శరత్కాల మందలి నీటియొక్క మహిమను చరకసంహిత ఈవిధంగా ప్రశంసించింది.

దివా సూర్యాంశుసన్తప్తం నిశిచంద్రాంశు శీతలం
కాలేన పక్వం నిర్దోషం అగస్త్యేనావిషీకృతం
హంసోదకమితి ఖ్యాతం శారదం విమలం శుచి
స్నాన పానా గాహేషు హితమంబు యథామృతమ్॥

VI. 45:46

పగలు సూర్యకిరణాలచే కాగి, రాత్రిపూట వెన్నెలతో చల్లబడి, కాలప్రభావంతో పక్వమై, దోషరహితమై, అగస్త్యనక్షత్రకాంతి ప్రసారంతో నిర్విషమై, స్వచ్ఛము, శుచియు అయిన శరత్కాల మందలి నీరు హంసోదకమగు పేర ప్రసిద్ధమైనది. ఈ జలంస్నానపానాదులకు, ఈదుటకు యోగ్యమై అమృతము వలె హితకరమైనది.

ఈ విధంగా ప్రకృతి గతమైన నదులందు, వాయువునందు, మృత్తికయందు, చంద్రసూర్యనక్షత్రాదులందు, ఓషధివనస్పతులందు దివ్యత్వాన్ని దర్శించి, సేవించి, వాటిని నిత్యజీవితంలో చికిత్సాదులద్వారా సద్వినియోగం చేసుకొనే సంప్రదాయం మన భరతవర్షంలో అతిప్రాచీన కాలంనుండి వస్తున్నది.